# సర్వోదయానికి నా ప్రయాణం

మూలం

జయప్రకాశ్ నారాయణ్

★

అనువాదం

బి. నాగేశ్వరరావు

సర్వోదయ సాహిత్య ప్రచార సమితి

గాంధీ భవన్ :: హైద్రాబాదు

ప్రకాశకులు :
అఖిలభారత సర్వసేవా సంఘ పక్షమున
సర్వోదయ సాహిత్య ప్రచారసమితి
గాంధీభవన్ : : హైద్రాబాదు.

*

తొలి ముద్రణ
ఏప్రియల్ 1958
ప్రతులు : ఐదువేలు
వెల : 37 నయాపైసలు
లేక 6 అణాలు

*

ముద్రణ :
అజంతా ప్రింటర్స్
సికింద్రాబాదు.

# सर्वोदयानिकि ना प्रयाणम्

SOCIALISM TO SARVODAYA

का

तेलुगु अनुवाद

मूल : जयप्रकाश नारायण
अनुवादक : बी. नागेश्वरराव

*

पहली बार
अप्रैल 1958
प्रतियाँ : पाँच हज़ार
मूल्य : 37 नये पैसे
या 6 आने

*

सर्वोदय साहित्य प्रचार समिति
गांधीभवन, हैद्राबाद

*

मुद्रक
'अजन्ता प्रिण्टर्स'
सिकन्दराबाद

# ప్రస్తావన:

భారత సోషలిస్టు ఉద్యమ మూల పురుషుల్లో శ్రీ జయ ప్రకాశ్ నారాయణ ఒకరిని ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు. అలాగే ఆయన ప్రగాఢదేశభక్తి, జాతీయ స్వాతంత్ర్య సమరంలో ఆయన ప్రదర్శించిన అత్యద్భుతమైన ధైర్యసాహసాలు, చేసిన త్యాగాలు కూడా అందరికీ తెలిసినవే. ఇవన్నీ ఆయన్ను పార్టీ రాజకీయాలకు ప్రాంతీయ అవధులకు అతీతమైన జాతీయ నాయకునిగా చేశాయి.

సమర సామర్థ్య దక్షతేకాక నిర్మాణకౌశలంతోపాటు రాజకీయ శాస్త్ర పారంగతత్వం కూడా కల శ్రీ జయప్రకాశ్ నారాయణ భావనలు, భారతీయ మేధా సంపన్నులను, యువజనులను ఇనుమిక్కిలిగా ఆకర్షించి ప్రభావితం చేశాయి. అవి వివాదంతో పాటు ఆలోచనను కూడా రేకెత్తించాయి. మార్క్సువాదిగా, సామ్యవాదిగా ప్రయాణం ఆరంభించిన ఈ జిజ్ఞాసువు, సత్యాన్వేషి సర్వోదయం చేరుకున్న సంఘటన పరమోత్కృష్టమైనది. దీనికి పూర్తి విలువను కట్టాలంటే మరికొంత చరిత్ర జరిగి పోవలసి ఉంటుంది. అయినా ఏ భావాలు, ఏ అనుభవాలు ఆయనలో ఇలాంటి పరిణామాన్ని తెచ్చాయో ఆయన ముఖతానే తెలుసుకోవాలని దేశంలో చాలామంది ఆతురత జెందారు. సరిగా ఈ విషయాన్నే వివరిస్తూ శ్రీ జయప్రకాశ్ నారాయణ, అలహాబాదులో ఉంటున్న తన సహచరునికి ఒక సుదీర్ఘమైన లేఖ వ్రాశారు. దాని తెలుగు అనువాదమే ఈ పుస్తకం.

—అనువాదకుడు

# సర్వోదయానికి నా ప్రయాణం

ఎంతోకాలం ఆలోచించినతరువాత నీకీలేఖ వ్రాయాలని నిశ్చయించాను. అయితే ఇది అంత తేలికైన పనికాదు. జీవితంలో మొదటినుంచీ ఉన్న సంబంధాలను త్రెంచుకోవడం ఎప్పటికైనా సులభమవుతుందా? కలిసి పనిచేశాం. కలిసే కారాగారవాసం అనుభవించాము. ఒకరి కొకరు తోడు నీడలమై అజ్ఞాతవాసపు ప్రమాదాల నెదుర్కొన్నాం. చివరికి స్వాతంత్ర్యం తెచ్చిన ఆశా భంగాలను కూడా చవి చూశాం. అయినా మన ప్రయాణం ఇంకా ఎంతోకాలం సాగవలసే ఉంది.

కాని నేను మాత్రం ఈ యాత్రలో ఒక మజిలీ చేరుకున్నా ననుకుంటున్నాను. ఇక ఇక్కడినుంచి, నా తోడు నీడలను వదిలి ఏకాకిగా ప్రయాణించక తప్పదన్న నిర్ణయం నేను చేసుకోవలసి వచ్చింది. నాతోకూడా రమ్మనమని నిన్ను ఒప్పించగలిగితే నా ఆనందానికి అంతు ఉండదని నాకు తెలుసు. కాని కనీసం ఇప్పట్లో అది సాధ్యం కాదనికూడా నాకు తెలుసు. అయితే, మన మార్గాలు అడపాదడపా కలుస్తూనే ఉంటాయనీ, ప్రయాణాంత దశలో సమ్మిళిత మవుతాయనీ ఆశిస్తున్నాను. ఈ శుభపరిణామం స్వయంగా చూసేవరకు మనం బ్రతికి ఉండమేమో - కాని ప్రపంచం శాంతి, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వమనే తీరం చేరుకో

వాలంటే, సామ్యవాదం చివరికి సర్వోదయంలో సంలీనం కావలసి ఉంటుందని నా విశ్వాసం.

నాలుగు సంవత్సరాలక్రితం, బుద్ధిగయ సర్వోదయ సమ్మేళనంలో రాజకీయాలకు స్వస్తి చెప్పాలని నిర్ణయించుకున్నాను. అయినా, అప్పుడప్పుడు పార్టీ సమావేశాలకు రావడం, ఏమైనా సలహాలు ఇవ్వడం మినహా ఏమీ చేయనప్పటికీ ప్రజా సోషలిస్టుపార్టీసభ్యుడిగా ఉంటూవచ్చాను. గత సాధారణ ఎన్నికలకు కొంతకాలంక్రింద, కార్యశీలత్వం లేని ఈ మాత్రం సభ్యత్వాన్ని కూడా వదిలిపెట్టాలనుకున్నాను. కాని ఆచార్యజీ అస్వస్తతగా ఉన్నారు. ఆయనతో చర్చించకుండా ఏ నిర్ణయానికీ రావడం నాకిష్టంలేకపోయింది. దురదృష్టవశాత్తు ఆచార్య నరేంద్ర దేవ నిర్యాణం చెందారు. ఆయన అస్తమయం ఈ దేశానికీ, సోషలిస్టు ఉద్యమానికీ తీరని హాని కలిగింది. అదివరకే చీలికలతో బలహీనపడిన ప్రజా సోషలిస్టు పార్టీకి తీవ్రాఘాతంగా తగిలింది. అందుకే ఎన్నికలు జరిగిపోయేవరకు నా రాజీనామాను వెల్లడి చేయవద్దని పార్టీలో ప్రధాన సహచరులు కోరారు. నేను ఒప్పుకున్నాను. కాని ఎన్నికలు జరిగిన వెంటనే రాజీనామా ప్రకటన చేస్తానని వాళ్ళందరికీ స్పష్టం చేశాను. అయినా ఈ ప్రకటన చేయడంలో ఇంతవరకు ఆలశ్యం జరిగింది. ఎందుకంటే, నాకు సహజమే అనిపించినా, ఇతరులకు తీవ్రమైనదిగా కనపడే ఈ చర్య తీసుకొనడంలో గల కారణాలను మీకూ దేశానికీ తెలియజేయాలనుకున్నాను. నేనసలు రాజకీయాలు ఎందుకు వదిలిపెట్టాలి అని దాదాపు ప్రతిరోజూ ఎవరో ఒకరు ప్రశ్నిస్తూ

ఉంటారు. రాజకీయాలపై ప్రజలకుగల ఆశావిశ్వాసాలు చూస్తూ ఉంటే నాకు జాలివేస్తుంది. కాని నా చర్యకు కారణభూతమైన హేతువులను అందరికీ విడివిడిగా చెప్పగలగడం కష్టం. వాటిని కూడ వివరించే యత్నం చేస్తాను.

ప్రజలపై రాజకీయాలకు ఉన్న ప్రభావంవల్లనైతేనేం, రాజకీయాలకు ప్రత్యామ్నాయం ఇంకా అత్యారంభదశలో ఉండడంవల్లనైతేనేం, ఈ ప్రకటనను చదివే వారిలో చాలా మందిని నేను ఒప్పించలేకపోవచ్చును. కాని ఇక్కడ నేను వివరించబోయే అభిప్రాయాలపట్ల, ఈ లేఖద్వారా, ఆసక్తి హెచ్చి, పరస్పరావగాహన ఇతోధికం కావచ్చును. అయితే ఇక్కడ మరోవిషయం ఉంది. ఎవరైనా తన పూర్వానుభవాల దృష్టితోనే దేన్ని అయినా చూస్తారు. నాలాంటి అనుభవాలు పొందనివారు, నా ఆదర్శాలను అనుసరించనివారు నా వాదనతో అంగీకరించలేకపోవచ్చును. సోషలిజం, వర్గ సంఘర్షణ, రాజకీయ కార్యాచరణ, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అంటే క్రొత్తగా ప్రేమాసక్తులు పెంచుకున్నవ్యక్తి, బహుశా నన్నర్థంచేసుకోలేడు. ఎంత ఉత్సాహాసక్తులు ఉన్నా, పై పద్ధతుల్లో అనుభవపూర్వకంగా తను గమనించిన లోపాలను ఎలా తొలగించాలో తెలుసుకునేవరకు అతనర్థం చేసుకోలేడు. అయితే సాంఘిక సమస్యలకు పరిపూర్ణమైన పరిష్కారం నాకు కనిపించిందని కానీ, సాంఘిక తత్వశాస్త్రంలో సర్వోదయ సిద్ధాంతమే చరమఘట్టమని కానీ నే ననడంలేదు. ప్రకృతి సిద్ధంగానే మానవుడు అన్వేషి. అందుకే అతను నిత్యం సత్యాభిముఖుడై ముందుకు

పోతున్నాడు. అత నెప్పటికీ చరమ సత్యాన్ని చేరలేడు. కాని క్రమేణా అసత్యాన్ని తొలగిస్తూ, నెమ్మదిగా సత్యాన్ని సమీపించ వచ్చును.

సర్వోదయ తత్వం గురించి చేసే ఆలోచనలోను, దాని ఆచరణలోను రాను రాను ఎన్నో లోపాలు బయల్పడ్డాయి; ముమ్ముందు వాటిని తొలగించి, సత్యమనే శిఖరారోహణను మానవుడు కొనసాగిస్తూనే ఉంటాడనడంలో సందేహం లేదు. అయితే, ప్రస్తుత సాంఘిక తత్వశాస్త్రాల అవధులను, సాంఘిక వ్యవస్థల పరుధులను సర్వోదయతత్వం స్పష్టంగా దాటిపోయిందని నా నమ్మకం. ఈ నిర్ణయానికి నే నెలా వచ్చానో వివరిస్తాను. అంటే సర్వోదయ తత్వ వివరణను సంపూర్ణంగా ఇక్కడ చేస్తానని కాదు. అందుకు తగిన యోగ్యత నాకు లేదు. కాని చివరికి రాజకీయాలకు నేను స్వస్తి చెప్పడానికి దారితీసిన నా ఆలోచనా పరిణామాన్ని మాత్రం వివరిస్తాను.

## సహాయ నిరాకరణనుండి సామ్యవాదానికి

పరిచయస్తులు కానివారికి నా గత జీవితం లక్ష్యస్పష్టత, నిలకడ లేకుండా వంకరటింకరగా సాగినట్టు కనపడుతుంది. కాని నేను తిరిగి చూసుకుంటే క్రమానుగతంగా నేరుగా ఉన్న బాటే నాకు కనపడుతున్నది. మార్గం కోసం అన్వేషణ చేయకపోలేదు. కాని అది గ్రుడ్డి అన్వేషణ కాదు. నా లక్ష్యం మొదటినుంచీ ప్రకాశమానంగా నా దృష్టిపథంలో ఉన్నది. అందుకే నేను త్రొక్కిన దారి పై పైకి కంటకావృతంగా కనపడింది. ఇంతవరకు

నేను చేసిన ప్రయాణ మార్గం మెలికలు తిరిగిన తీగవలె ఉన్నా నాకు విచారంలేదు. ఇందువల్ల ఇకముందు నేను నిశ్చయించుకున్న దారిపై నడవగలనన్న విశ్వాసం ఇతోధికంగా కలిగింది.

చిన్న వయస్సులో, ఆనాటి పిల్లలందరివలెనే నేనుకూడా అత్యుత్సాహియైన జాతీయవాదినై, విప్లవలక్ష్యంవైపు మ్రొగ్గాను. అప్పటి విప్లవోద్యమానికి బెంగాల్ ఉదాత్తమైన నాయకత్వం వహించింది. కాని ఆ రోజుల్లో కూడా దక్షిణాఫ్రికా సత్యాగ్రహ గాథ నా బాల్య హృదయాన్ని స్పందింప జేసింది. నా విప్లవ ప్రవృత్తులు పరిపక్వదశ నందుకొనకముందే ప్రజలను అద్భుతంగా సమున్నతపరచే ఝంఝూమారుతంలా గాంధీజీ ప్రథమ సహాయ నిరాకరణోద్యమము దేశాన్ని ముంచెత్తింది. పెనుగాలిలో ఎగిరే ఆకుల్లాగా ఆ నాడు ఆకాశాని కెగసిన అసంఖ్యాక యువకుల్లో నేనూ ఒకణ్ణి. ఒక మహోన్నతమైన భావమునను రేకెత్తించిన వాయువీచికల్లో ఆ ఆకాశారోహణానుభూతి క్షణికమే అయినా, హృదయ ఫలకంపై అది వేసిన ముద్రను ఆతరువాత వాస్తవిక ప్రపంచపు కురూపంతో కలిగిన సాన్నిహిత్యంకాని, కాల ప్రవాహంకాని తొలగించలేక పోయాయి.

అప్పటినుంచి స్వాతంత్ర్యం నా జీవిత ధ్యేయానికి గల వెలుగు బాటల్లో ఒకటయింది. రాను రాను ఈ స్వాతంత్ర్య లక్ష్యం కేవలం నా దేశ దాస్యవిముక్తివరకే పరిమితమై ఉండక, మానవు డెక్కడ ఉన్నా, అన్ని రకాల బంధనాలనుంచి విముక్తి చెంది, మానవ వ్యక్తిత్వం, మానవుని ఆలోచన, మానవుని ఆత్మ

స్వాతంత్ర్యం పొందాలన్న భావంగా పరిణమించింది. జీవితాన్ని ఉద్దీపితం చేసే భావనగా రూపొందిన ఈ స్వేచ్ఛను, భుక్తికోసం కాని, అధికారం, భద్రతలకోసం కాని, దేశ వైభవంకోసం కాని మరి దేనికోసం కాని నేను వదులుకో దలచలేదు.

చిత్రంగానే ఉంటుంది. కాని, పెట్టుబడిదారీతత్వం పునరుద్ధరణ జెంది విజయవంతమైన అమెరికా సంయుక్త రాష్ట్రాల లో నేనుండగా మార్క్సు తత్వములో - ఇంకా స్పష్టంగా చెప్పాలంటే - ఆ నాటి సోవియట్ కమ్యూనిజంలో నాకు నమ్మకం కుదిరింది. 1922 నుంచి 1929 వరకు నేను అమెరికాలో ఉన్నాను. అప్పటి La Follette అభ్యుదయ తత్వానికి పుట్టినిల్లయిన విస్కాన్సిన్ రాష్ట్రంలో ఉన్న మాడిసన్ నగరంలో ఐరోపా దేశాలకు యూదుజాతికి చెందిన విద్యార్థుల సహచర్యంలో, మార్క్సు తత్వపీయూషను తనివిదీర గ్రోలాను. అప్పటివరకు ఆంగ్లంలో మార్క్సిజం గురించి ఉన్న ప్రతి గ్రంథాన్నీ చదివాననుకుంటాను. సూక్ష్మబుద్ధి కల ఒక జర్మనీ విద్యార్థి సహాయంతో అనువాదంకాని మార్క్సు ఇతర రచనలను కూడా పఠించాము. యూరప్‌నుంచి కమ్యూనిష్టు సెల్సులోకి ముఖ్యంగా ఆసియా విద్యార్థులకు అందిన వాడిబాణాల్లాంటి ఎం. ఎన్. రాయ్ రచనలుకూడా చదివి జీర్ణించు కొనడంతో మా మార్క్సు వాద అధ్యయనం సంపూర్ణమైంది.

స్వాతంత్ర్యమే అప్పటికీ మా లక్ష్యమైనా గాంధీజీ సహాయ నిరాకరణం, సత్యాగ్రహంకన్న మార్క్సు ప్రతిపాదించిన విప్లవ మార్గమే ఆ లక్ష్యసాధనకు నమ్మకమైన సమీప మార్గమని

పించింది. మేము తీరని దాహంతో మననం చేసుకున్న లెనిన్ మహాశయుని అత్యద్భుత విజయ గాథలు, మార్క్స్ క్రాంతి పంథాఘనతను సందేహింప పనిలేదనిపించాయి.

సమానత, సౌభ్రాతృత్వం - ఈ రెంటిని ప్రతిపాదించి, మార్క్సువాదం నాకు మరో వెలుగును కూడా చూపింది. కేవలం స్వాతంత్ర్యం చాలదు. అందరికీ, అత్యల్పులకుకూడా, స్వాతంత్ర్యం ఉండాలి. ఆకలి, దారిద్ర్యం, శోషణల నుంచి విముక్తి ఉండాలి. దారిద్ర్యం, బాధపట్ల సానుభూతి నా మనస్సులో అజ్ఞాతంగా నైనా యేర్పడడానికి చిన్నతనంలో కలిగిన అనుభూతు లేమిటో నాకు తెలియదు. కాని ఈ సానుభూతి మొదటినుంచీ ఉండేది. అది మార్క్సువాదంవల్ల సచేత మైంది. అమెరికాలోని నా జీవిత విధానం సానుభూతికి మరింత బలాన్ని చేకూర్చింది. క్రింది మధ్యతరగతికి చెందినవాడినవడంవల్ల నా కుటుంబంవల్ల లభించిన సహాయమేమీ లేదు. నా పోషణకు, యూనివర్సిటీవిద్య ఖర్చుకు పొలంలో ఫ్యాక్టరీలో సాధారణ కూలీగా నేను పనిచేయవలసి వచ్చింది. స్వాతంత్ర్యంతోపాటు సమానతాభావం కూడా నన్ను ఆకర్షించింది. ఇలాంటి ముఖ్యమైన ఈ సమస్యపై గాంధీజీ అభిప్రాయా లేమే మిటో నా కప్పటికి సరిగా తెలియవు. నిజానికి, గాంధిజీ సాంఘిక విప్లవానికి వ్యతిరేకనీ, క్లిష్టమైన ఒకానొక సమయంలో ఆయన శోషణ విధానాన్ని బలపరచి తీరుతారనీ ఎం. ఎన్. రాయ్ రచనలు నన్ను నమ్మించాయి. (ఎం. ఎన్. రాయ్ ఈ అభిప్రాయాలను ఆతరువాత చాలా మార్చుకున్నారు). సాంఘిక విప్లవంగూర్చి గాంధీగారికి స్వయంగా కొన్ని అభిప్రాయాలు ఉన్నాయనీ, వాటిని

సాధించే మార్గాలు కూడా ఆయనకు ఉన్నాయనీ, నేనప్పటికి తెలుసుకోలేకపోయాను.

## సామ్యవాదంనుంచి ప్రజాస్వామ్య సమాజవాదానికి

ఇండియాకు నేను 1929 అంతంలో తిరిగి వచ్చినప్పుడు మార్క్సు వాదానికి వాతావరణం అనుకూలంగా లేదు. జాతీయ వాద జ్వాలలు మిన్నుముట్టుతున్నాయి. ఆ సంవత్సరం డిశంబరులో సర్దార్ భగత్‌సింగ్, ఆయన సహచారుల మరణశిక్షను రద్దు చేయమని ఇర్విన్ ప్రభువును ఒప్పించడంలో గాంధీజీ వైఫల్యం చెందడంతో జాతీయ స్వాతంత్ర్య సంస్థాపనకు బ్రహ్మాండమైన రంగనిర్మాణం జరిగింది. హృదయపూర్వకంగా నే నాసమరం లోకి దూకాను. కాని భారత కమ్యూనిస్టులు మాత్రం ఆ సమర రంగంలో నాక్కైక డా కనపడలేదు. మీరట్ కుట్రకేసుసందర్భంలో కొందరు జైళ్ళలోఉన్నమాట నిజం. అయినా బయట ఇంకా చాలా మంది ఉన్నారు. అజ్ఞాతవాసంలో ఏదోరూపంలో భారత కమ్యూనిస్టుపార్టీ పనిచేస్తూనే ఉంది. నేనూ అజ్ఞాతంలోకి వెళ్ళాను కాబట్టి వారు పోరాటంలో పాల్గొంటూ ఉన్నట్లయితే అజ్ఞాతంలో కూడా ఎక్కడైనా తారసిల్లడం సాధ్యమే. అయినా కమ్యూనిస్టులుమాత్రం ఎక్కడా కనిపించలేధు. ఘోరమేమిటంటే ఆ జాతీయ సమరాన్ని బూర్జువా ఉద్యమమనీ, గాంధీజీని బూర్జువా తొత్తు అని వారు ప్రచారం చేస్తున్నట్లు తెలిసింది. అదంతా ఒక బుద్ధిహీనమైన సిగ్గు చేటు గాధ. దాన్నంతా ఇక్కడ చెప్పదలచలేదు. భారత కమ్యూ

నిస్టులతోను వారి రకానికిచెందిన మార్క్సువాదంతోను నాకుకలిగిన ఇబ్బందులను సూచించడానికి దీన్ని ప్రస్తావించాను. మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టుసంస్థ (Third Communist International) చూపినద్వారినే భారత కమ్యూనిస్టులు అనుసరించారు. అది అప్పటికే స్టాలిన్ ఆధిపత్యంక్రిందికి పూర్తిగా వచ్చింది. సోషలిస్టు ఉద్యమాన్ని, కార్మిక ఉద్యమాన్ని ప్రపంచమంతటా చీలదీసి, కమ్యూనిస్టులను జాతీయోద్యమాలనుంచి విడదీయడానికి కారణభూతమైన విధానాన్ని ఈ "కోమిన్ టర్న్" 1928 నుంచి అవలంబిస్తూ వచ్చింది. ఈ విధానం లోపభూయిష్టమైనదనీ మార్క్సువాదానికి భిన్నమైనదనీ, ముఖ్యంగా లెనిన్ మహాశయుడు నిర్వచించిన వలసరాజ్య విధానానికి పూర్తిగా వ్యతిరేకమైనదని నాకనిపించింది. ఈ విషయాన్ని తరువాత అందరూ అంగీకరించారుకూడా. భారత కమ్యూనిస్టుపార్టీతో నాకు కలిగిన ఈ విభేదాలు అప్పటివరకు కమ్యూనిస్టు తత్వానికి అన్నివిధాల ఆదర్శప్రాయమని నేను అనుకుంటున్న సోవియట్ రష్యానుంచి కూడా ఆశయాల విషయంలో నేను దూరంకావడానికి దోహదంచేశాయి. అధికారంకోసం అంతకుపూర్వం రష్యాలో జరిగిన సంఘర్షణ ఏదో కాస్త మానసికాందోళనలో తప్ప, నా ప్రధాన లక్ష్యాలకు సంబంధించినంతవరకూ ప్రభావం ఏమీ అంతవరకూ నాపై కలిగించలేదు. నిజానికి ఈ సంఘర్షణలగూర్చిన సమాచారం కూడా సరిగా లభించలేదు. కాని సోవియట్ అధినేతల ఆజ్ఞల ననువర్తించి భారత కమ్యూనిస్టులు అనుసరిస్తున్న విధానం మార్క్సు విధానానికి, మార్క్సు వాదానికి అనుగుణ్యంగా లేదని మాత్రం

నాకు గోచరించింది. అప్పుడే సోవియట్ రష్యాపై నాకు గల సానుభూతి సన్నగిల్లింది.

## కాంగ్రెసు సోషలిస్టు పార్టీ

భారత కమ్యూనిస్టుపార్టీలో చేరకుండా, స్వాతంత్ర్య సమర యోధుల్లో చేరిపోయాను. స్వాతంత్ర్యం కాని, స్వరాజ్యం కాని కేవలం జాతీయ స్వాతంత్ర్యం కాదని అప్పటికే నాకు బోధపడింది. స్వతంత్ర భారతం అంటే సోషలిస్టు భారతమనీ, స్వరాజ్యం అంటే అణగద్రొక్కబడిన బీదల రాజ్యమనీ నా కనిపించింది, కరాచీ తీర్మానాలు ఏమి చెప్పినప్పటికీ, పై ఆశయాలగూర్చి కాంగ్రెసు విధానాలు, కార్యక్రమాలు నాకు అస్పష్టమూ అసంపూర్ణమూ అనిపించాయి. కాగా నేను నాలాగనే ఆలోచించే స్వాతంత్రయోధులు కలసి కాంగ్రెసు సోషలిస్టు పార్టీని స్థాపించాము. కాంగ్రెసు సాంఘిక విధానాలు ఇంకా స్పష్టంగా సోషలిస్టు బద్ధం కావాలనీ, స్వాతంత్ర్య సమరాన్ని ఇంకా విప్లవాత్మకంగా జరిపించాలనీ - మార్క్సు పరిభాషలో చెప్పాలంటే, జాతీయ స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రజల ఆర్థిక - సాంఘిక విమోచనోద్యమంతో ముడిపెట్టాలని ఈ పార్టీ ఆశయం. కాంగ్రెసు విధానాలకు సాంఘికార్థిక, దృక్పథాన్ని కలిగించడంలోనూ, దాని స్వాతంత్ర్య సమర నిర్వహణసామర్థ్యాన్ని ఇనుమడింప జేయడంలోనూ కాంగ్రెసు సోషలిస్టుపార్టీ గణనీయమైన పాత్ర నిర్వర్తించింది. మొత్తానికి కాంగ్రెసు సోషలిస్టులు భయమెరుగని స్వాతంత్ర్య యోధులు.

1930, ఆ తరువాతను మన జాతీయోద్యమం తీవ్రరూపం దాల్చుతున్న కాలంలో యూరపులో ఘోరమైన పరిణామాలు కలిగాయి. వీటి ఫలితంగా హిట్లర్ అధినేతగా అవతరించాడు, క్లిష్టంగా, పేచీమయంగా ఉన్న జర్మన్‌దేశ సమస్యలను అర్థో న్మాది పరిష్కరించలేడు కాబట్టి, త్వరలోనే హిట్లర్ పతనం జరిగి తీరుతుందని స్టాలిన్ జోస్యం చెప్పాడు. హిట్లర్ స్మశానంపై కమ్యూనిస్టుజర్మనీ నవనిర్మాణం జరుగుతుందని అన్నాడు. కాని ఇలాంటిదేమీ జరగకపోగా హిట్లర్ తన అధికారాన్ని స్థిరపరచు కొని, కమ్యూనిస్టులను. సోషలిస్టులను, సుసంఘటితమైన కార్మిక సంస్థలను కూడా అణచివేసి ప్రపంచ దండయాత్రకు కదంగి కొంత పురోగమించినప్పుడు క్రెమ్లిన్ అధినేత (స్టాలిన్) కు నిద్రాభంగమైంది. తన గృహప్రాంగణంలో ప్రత్యక్షమైన యుద్ధ దేవతను చూచి తన విధానాలను స్టాలిన్ మార్చుకున్నాడు.

## స్టాలిన్ చేసిన ఘోరమైన తప్పు

స్టాలిన్ చేసిన తప్పులను బయటపెట్టడం ఇప్పుడొక ఆచా రమై పోయింది. కృశ్చేవ్ కొన్నింటిని త్రవ్వి బయట పెట్టాడు. ఝుకోవ్ కూడా అలా చేయడానికే నిరీక్షిస్తున్నాడల్లేఉంది. ఈ ఆచారాన్ని అవలంబించే వాంఛ నాకు లేదు. కాని, స్టాలిన్ చేసిన ఘోరాతిఘోరమైన తప్పు ఒకటి ఉంది. అది మహానేరం కూడా. ఇదేమిటంటే స్టాలిన్ జర్మనీలో అవలంబించిన విచ్ఛిన్నకర విధానంఫలితంగానే అధికారమంతా హిట్లర్ హస్తగతమైంది. దీన్ని అందరూ గుర్తించేరోజు రాకపోదు. ఆనాడు, జర్మన్

సోషల్ డెమోక్రాట్లు తమ ప్రప్రథమ శత్రువులనీ నాజీలస్థానం ఆ తరువాత నేననీ స్టాలిన్ ప్రేరణపైనే జర్మన్ కమ్యూనిష్టులు ప్రకటించకపోయి ఉన్నట్లయితే హిట్లర్ జర్మనీ నియంత కావడం ఎప్పటికీ పడకపోను. నాజీతత్వం విజయం పొందిన తరువాత కమ్యూనిస్టులు అవలంబించిన సోషలిస్టు ఐక్యత, ప్రజా సంఘటన విధానాలను అంతకుముందే అనుసరించినట్లయితే, నాజీ హత్యాకాండ, ద్వితీయ ప్రపంచ సంగ్రామం జరిగేవే కావు.

ఈ ఐక్యప్రజాసంఘటన విధానం భారతదేశంలో కూడా ప్రతిధ్వనించింది. భారత కమ్యూనిస్టులు కూడా పిల్లిగంతు వేయడమే తమ విధి అనుకొని అప్పటిదాకా తాము తూర్పారబడుతున్న భారత జాతీయ కాంగ్రెసును జాతీయ సంఘటనగా గుర్తించారు.

నేనింకా అప్పటికి మార్క్సు వాదానికే అంటిపెట్టుకొని ఉన్నాను. కాబట్టి కమ్యూనిస్టుల ఈ నూతన పంథా నాకెంతో సంతోషాన్ని కలిగించింది. అణగారిన ఆశలు మళ్ళీ చిగిర్చాయి. సోషలిస్టు - కమ్యూనిస్టుల సమైక్య పార్టీ యేర్పడి, జాతీయ స్వాతంత్ర్యోద్యమంతోపాటు భారత సోషలిస్టు ఉద్యమం కూడా ఇలాంటి సమైక్య నాయకత్వంక్రింద వేగంగా పురోగమిస్తుందని కలలు గన నారంభించాను!

నాకు ప్రధాన సహచరులుగా ఉన్న రామమనోహర్ లోహియా, ఎం. ఆర్. మసానీ, అచ్యుత పట్వర్ధన్, అశోక మెహతా లాంటివారు నా ఈ విధానాన్ని వ్యతిరేకించారు. అది విపత్తుకు దారితీయకమానదని వాదించారు. కాని మార్క్సువాదంపై నాకు గల విశ్వాసం నా కనుగప్పింది. నా కలలకు క్రియారూపం

ఇవ్వనారంభించాను. ఆచార్య నరేంద్రదేవ నన్ను బలపరిచారు. కమ్యూనిస్టుపార్టీతో ఒడంబడిక కుదిరింది. దానిప్రకారం కా. సో. పార్టీలో కమ్యూనిస్టులు సభ్యులుగా చేరే అవకాశం కల్గించాము. కా. సో. పార్టీ శాఖలను, ముఖ్యంగా దక్షిణంలో విశ్వాస పాత్రులైన సోషలిస్టులను కాదని కమ్యూనిస్టులకు చేతులార హస్తగతం చేశాము. కా. సో. పా. సహాయంతో కమ్యూనిస్టులు ఏ. ఐ. సి. సి.కి ఇతర కాంగ్రెసు సంస్థలకు ఎన్నికైనారు. కార్మిక సంస్థల్లోకూడా కలిసి పని చేయాలనుకున్నాము.

ఈ విధానంయొక్క ప్రమాదకరమైన ఫలితాలు అందరికీ తెలిసినవే. దక్షిణదేశమంతా సోషలిస్టు ఉద్యమం కమ్యూనిస్టుల స్వాధీనమై పోవడం వీటిలో ఒకటి. కాని పగటి కలలాంటి ఆ అనుభవంవల్ల ఒక మంచిమాత్రం జరిగింది. రాజకీయాల్లో అది మాకొక అద్భుతమైన పాఠాన్ని నేర్పింది. కోమిన్‌టర్నుకు లేక క్రెమ్లిన్‌కు అనుబంధితమైన కమ్యూనిస్టుపార్టీతో ఎలాంటి ఐక్యత కూడదని తెలుసుకున్నాము. (ఇలా తెలుసుకోవడం మాలో చాలా మందికి దుఃఖాన్ని కలిగించింది). ఇలా అనుబంధితమైన కమ్యూనిస్టుపార్టీ స్వతంత్రమైనదికాదు. అది మాస్కోకు కీలుబొమ్మ అయి, దాని మొదటిభక్తి రష్యాపై ఆ తరువాతనే మరిదేనిపైనేనా అనీ; కమ్యూనిస్టులు ఎప్పుడైనా ఐక్య సంఘటనలగూర్చి ప్రస్తావిస్తే పచ్చిస్వార్థంతోనో లేక పరిస్థితుల వత్తిడి వల్లనో మాత్రమే ననీ గుర్తించాము. కమ్యూనిస్టులు తప్పనిసరియైనప్పుడు కొందరు తొత్తులతోతప్ప అధికారంలో ఇతర్లతో భాగం పంచుకోలేరనీ, వారి ఆశయ మెప్పటికైనా ఏకపక్షబద్ధమైన కమ్యూనిస్టు రాజ్యమే

నని తెలుసుకున్నాము. ఈ పాఠాలు ఎంతో విలువైనవి. కాని బహుశా ఇందుకు మేము చెల్లించిన మూల్యం చాలా ఎక్కువ. రెండవ యుద్ధం ఈ పాఠాలకు ఇంకా బలాన్ని చేకూర్చి, ఎంతో ఆశతో సాధించిన కా. సో. పా - భా. క. పార్టీల కలయికను పూర్తిగా విడగొట్టింది.

అంతర్జాతీయ కమ్యూనిజం ప్రస్తుతం, నూతన ప్రసవ వేదనల ననుభవిస్తున్నది. ఫలితం పురిటిలోనే దోషం కొట్టడమే అవుతుందో మరేమవుతుందో ఇప్పుడే చెప్పలేము. సుఖప్రదమైన జననం జరగాలనే నాలాంటి వారందరి కోరిక.

భారత కమ్యూనిస్టు పార్టీతో మాకు ప్రత్యక్షంగా కలుగుతున్న అనుభవాలే కాక ఆ కాలంలోనే సోవియట్ రష్యాలో జరుగుతున్న పరిణామాలు కూడా నా ఆలోచనలను తీవ్రంగా ప్రభావితం చేశాయి. అక్కడ ప్రఖ్యాత కమ్యూనిస్టు నాయకులపై పాపపంకిలములైన విచారణలు ప్రారంభమయాయి. అదివరకు ఈ నాయకుల రచనల నెన్నింటినో, నేను ఎంతో ఆసక్తితో చదివాను. వీరంతా మహానాయకులు. లెనిన్ కుడి-ఎడమభుజాలుగా చరిత్రలో అసమానమైన మహా విప్లవాన్ని నడిపిన ధీరులు వీరు.

ఈ విచారణలకు సంబంధించిన వార్తలతోపాటు, నేను నిజాయితీపరులని నమ్మిన వ్యక్తులు రష్యాలో స్వయంగా పరిశీలించి వ్రాసిన రచనలుకూడా వెలువడ్డాయి. వీటితో సోవియట్ భూమిపై క్రమేణ రుద్దబడిన దారుణమైన పాలనాపద్ధతిస్వరూపం బహిర్గతమైంది. యూజన్‌లయన్ వ్రాసిన Assignment in

Utopia నన్ను ఎంతో కలవరపెట్టిన మొదటి గ్రంథాలలో ఒకటి. ఆ తరువాత ట్రాట్స్కీ వ్యవహారం గూర్చి జాన్‌డ్యూయి చేసిన పరిశోధన ఫలితాలు వచ్చాయి. ఆయన కనిపెట్టిన వాస్తవాలను నిర్లక్ష్యించడం సాధ్యంకాదు. కామెనెవ్, జినొవీవ్, రాడెక్, లైకోవ్, బుఖారిన్ లాంటి వ్యక్తులపై జరిగిన ఆరోపణలు, ఆ మీదట ఆ ఆరోపణలను వారు అంగీకరించారని వెలువడిన ప్రకటనలు హృదయ విదారకమైన సంఘటనలు. కమ్యూనిస్టు నాయకత్వంలో పై వ్యక్తుల తరువాతిశ్రేణులకు చెందిన ఇతర్లు ఎంతమందో ఇలాంటి ఘోరాలకు గురియైనారు. తన ప్రమేయమేమీ లేని ఆ తరువాతి విచారణలను కృశ్చెవ్ ఖండించాడు. సోవియట్ రష్యాలో స్వతంత్రత ఇంకా హెచ్చినప్పుడు, మిగతా దారుణాలను ఇతర కమ్యూనిస్టు నాయకులు బట్టబయలు జేస్తారనీ, చివరికి ట్రాట్స్కీ ఘనతకూడా పునఃస్థాపిత మవుతుందనీ చెప్పడంలో నాకెలాంటి సందేహం లేదు.

ఏమైనప్పటికీ ఈసంఘటనవల్ల, అనుభవాలలవల్ల, మార్క్సువాద మూలసిద్ధాంతాలను పునః పరిశీలన చేసుకోవడం నాకు తప్పనిసరియైంది. ఆ పునరాలోచన ఎంత బాధాకరమైనదో నా సోషలిస్టు సహచరులు చాలామందికి తెలుసు. అందులో వారంతా పాల్గొన్నారు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ, (ఆతరువాత సోషలిస్టుపార్టీ) త్రొక్కినపంథా అంతా ఈ ద్వితీయ అధ్యయనంతో ప్రభావితమైనట్టిదే.

మార్క్సిస్టు - లెనినిస్టు వాద వర్గంగానే కా. సో. పార్టీని ప్రారంభించాము. రష్యా కమ్యూనిస్టులు నాయకులు, భారత

కమ్యూనిస్టుపార్టీ, మార్క్సిస్టు - లెనినిస్టు వాదాన్ని ప్రపంచానికి, ముఖ్యంగా భారతదేశస్థితికి తప్పుడు విధంగా అన్వయింపజేస్తున్నారని మేము మొదటినుంచి వాదించాము. మార్క్సిస్టు - లెనినిస్టు వాదానికి ఎవరే అర్థాలు చెబుతున్నా, సాంఘిక విప్లవసాధనకు, సోషలిజంనిర్మాణానికి, అసలీఈవాదం చూపుతున్న మార్గం నమ్మకమైనదీ, సురక్షితమైనదీ కాదనే అభిప్రాయం నాకప్పటికే కలిగింది. హింస మంత్రసానిత్వం లేకపోతే విప్లవోద్భవం జరగదన్న సిద్ధాంతాన్ని పూర్తిగా కాదనలేకపోయినా, కనీసం (1) సాంఘిక మార్పులను ప్రజాస్వామిక మార్గాలద్వారా సాధించడానికి అవకాశం ఉన్న సమాజంలో హింసకు పూనుకొనడం విప్లవనిరోధక (Counter revolutionary) మనిపించుకుంటుందనీ, (2) ప్రజాస్వామిక స్వాతంత్ర్యం లేకపోతే సోషలిజం నిర్మాణంకాని, సోషలిజం ఉనికికాని సాధ్యంకాదనీ నాకు స్పష్టమైంది. ఈ తర్కానికి సహజపరిణామంగా, కార్మిక నియంతృత్వ సిద్ధాంతాన్ని తృణీకరించాను. ఈ కార్మిక నియంతృత్వం, ఆచరణరీత్యాచూస్తే అన్నివిధాలా, కేంద్రీకృతమైన పరిపాలనాయంత్రంద్వారా కొందరు కొనసాగించే నియంతృత్వమే ఈ కార్మిక నియంతృత్వమని చెప్పవచ్చును.

## రష్యా విప్లవం

రష్యా విప్లవం ప్రజావిప్లవం. జారిస్టు రష్యా ప్రజల్లో అత్యధిక సంఖ్యాకుల సహాయ సహకారాలు దానికి లభించాయి. కాని లెనిన్ దీన్ని అల్పసంఖ్యాకుల విప్లవంగా మార్చాడు. తనకు

బలంలేని రాజ్యాంగపరిషత్తును రద్దుపరచాడు. తిరుగుబాటుదార్లయిన సైనికుల సహాయంతోను, పట్టణాల్లోని కార్మికుల తోడ్పాటుతోను అధికారం వశం చేసుకున్నాడు. ఇక ఆ తరువాత విప్లవ ఉద్ధేశమే నశించింది. సోషలిజం వికృతరూపం దాల్చింది. దీని కంతటికీ కారణం అల్పసంఖ్యాకులైనవారు దౌర్జన్య పూర్వకంగా అధికారాన్ని వశం చేసుకొనడమేనని నా అభిప్రాయం.

అందుకే ఒకవేళ ప్రజాస్వామికమైన స్వేచ్ఛలు ప్రజలకు లేకపోయినా, హింసాయుతంగా జరిగే విప్లవానికి ప్రజాబలం ఉండాలి; విప్లవ ప్రభుత్వానికి అధిక సంఖ్యాకుల సమ్మతి సహాయాలు ఉండాలి అని నేను తలచాను. రాజ్యాంగబద్ధమైన ఎన్నికల్లో కంటే, విప్లవంలో ప్రజాభిమతం వ్యక్తం కాగలగడం సులభం. ప్రజాస్వామ్యపద్ధతిని అలవర్చుకొనడానికి సాంఘిక విప్లవానికి సంపూర్ణ స్వేచ్ఛ ఉండాలి. ప్రజల ప్రవృత్తులు ఎప్పటికైనా స్వేచ్ఛ, ప్రజాస్వామ్యాలకు అనుకూలంగానే ఉంటాయి. నియంతృత్వానికి తల ఒగ్గేటందుకు ఇష్టపడడం మానవసైజం కాదు. అధికసంఖ్యాకుల సమ్మతిలేని తమ నియంతృత్వ పాలనను ప్రజల నెత్తిన రుద్దేటందుకు, లెనిన్ ప్రేరణక్రింద కమ్యూనిస్టులు ప్రపంచంలో ప్రతిచోట ఎన్నో పన్నాగాలు పన్నారు.

ఒక్క చైనాలో మాత్రం స్థితి వేరుగా ఉండేది. అక్కడ ప్రజలు చియాంగ్‌కైషెక్‌ను కాక మౌసీతుంగ్‌నే ఎక్కువగా అనుసరించారు. అంతమాత్రాన చైనా ప్రభుత్వం నియంతృత్వ రాజ్యం కాకపోలేదు. బహుశా ఇది అల్ప సంఖ్యాకులపై అధిక సంఖ్యాకులు చలాయిస్తున్న నియంతృత్వం.

బహుశా యుగోస్లావియాలో కూడా పరిస్థితి ఇంతే. మిగతా అన్ని దేశాల్లోను కమ్యూనిస్టు ప్రభుత్వం, అల్ప సంఖ్యాకుల ప్రభుత్వమే. మొత్తంమీద, అల్ప సంఖ్యాకులైనా బహు సంఖ్యాకులైనా కమ్యూనిస్టులు నియంతృత్వ పరిపాలనా వ్యవస్థలను ఏర్పరచి, దాన్నే ప్రజల ప్రజాస్వామ్యమనో, ప్రజల సోషలిజమనో, తమకు సహజమైన రెండు నాల్కలతో చెబుతూ ఉంటారు. సోషలిజం స్థాపనకు ఏ రకమైన నియంతృత్వమూ అవసరం లేదనే అభిప్రాయానికే, ఈ పై కారణాలవల్ల నేను వచ్చాను.

సోషలిజమంటే కేవలం పెట్టుబడిదారీ విధానాన్ని తృణీకరించడమే కాదనికూడా నాకు సోవియట్ దేశానుభవంవల్ల తేటతెల్లమైంది. పెట్టుబడిదారీ విధానాన్ని నశింపచేయవచ్చు. పరిశ్రమలు, వాణిజ్యం, బేంకులు, వ్యవసాయం - వీటన్నింటినీ జాతిపరం చేయవచ్చు, సమిష్టి యాజమాన్యం క్రిందికి తేవచ్చు. అయినా సోషలిజమును ఇంకా ఇంకా చేరకుండానే ఉండవచ్చు. అంతేకాక సోషలిజముకు వ్యతిరిక్తంగా కూడా చివరికి తయారు కావచ్చు. సోవియట్ రష్యాలో లాంఛనప్రాయంగా నైనా, రాజ్యాంగబద్ధమైన స్వాతంత్ర్యాలు లేవు. సాంఘికన్యాయం కాని, సమానత కాని లేదు. పైగా అధికారాన్నంతా తమ చేతుల్లో కేంద్రీకరించుకున్నవాళ్ళ (Bureaucrats) తరగతి ఒకటి కొత్తగా అవతరించింది. శోషణ విధానం నూతనరూపం దాల్చింది. ఇదంతా కేవలం సోషలిజం నిర్మాణం జరగక పోవడమే కాదు, దాన్ని తృణీకరించడం కూడా.

## రష్యాలోని సోషలిజం

రష్యాలో జరిగిన ఈ పరిణామమంతా, కృష్చెవ్ చెప్పినట్లు ఒక అధికార మదాంధుడు (paranoiac) చేసిన దుష్కార్యాల ఫలితం కాదు. అక్కడ నిర్మింపబడిన సాంఘికార్థిక వ్యవస్థ చేసిన సృష్టి అది. రాజకీయార్థికాధికారం మితిమించి కేంద్రీకృతమై ప్రభుత్వమే సర్వస్వం అయినందుననే ఈ కీడు వాటిల్లింది. ఇలా అనుకొనికూడా గతాన్ని అంతా తరచిచూస్తే తృప్తిపడడానికి వీలులేకుండా ఉంది. ఈ అనంతమైన అధికార కేంద్రీకరణ, ప్రభుత్వ తత్వం (statism) ఏర్పడడానికి మూలకారణమేమిటన్న ప్రశ్నకూడా, ఇక్కడ ఉదయిస్తున్నది. దీనికి సమాధానం రెండు విధాలుగా ఉంది :

1. పరిశ్రమలు బాగా నెలకొన్న బూర్జువా సమాజంలో - శ్రామిక జనులు - జనాభాలో తమ సంఖ్య అత్యధికం కాబట్టి - విప్లవం సాధించటం చారిత్రకంగా జరిగేసంఘటన అనీ, సోషలిస్టు విప్లవం ఈ విధంగానే వస్తుందనీ మార్క్సు ఊహించాడు. ఇందుకు విరుద్ధంగా, పారిశ్రామికంగా వెనుకబడిన దేశంలో, దావాపు సైనిక క్రమశిక్షణతో, కేంద్రీకృత నాయకత్వం క్రింద వ్యవస్థీకృతమైన, దృఢనిశ్చయులైన విప్లవకార్లకూటమి సహాయంతో, దౌర్జన్య పద్ధతితో సోషలిస్టు విప్లవాన్ని సృష్టించే ప్రయత్నం లేనిన్ చేశాడు. "ఉన్న భౌతిక పరిస్థితులలోనుంచి విప్లవం ఉద్భవిస్తుంది ; ఆర్థికవ్యవస్థ తగినంతగా పరిణతి చెందినప్పుడు శ్రామిక తరగతులే సోషలిజం స్థాపనకు విప్లవశక్తులుగా పని చేస్తాయని మార్క్సు విశ్వసించారు. కాని ఇలా చారిత్రక పరిస్థితుల

కారణంగా కాక కేవలం కృత నిశ్చయంతో, బుద్ధిబలంతో, ముఖ్యంగా రాజకీయాధికారం చేబట్టడం ద్వారా సోషలిజమును స్థాపించవచ్చునని లెనిన్ ప్రధానంగా భావించారు. మార్క్స్ కంటే ముందు ఉన్న సోషలిస్టులు బాబిఫ్, బకునిన్ ప్రభృతులు కూడా ఓర్మి లేకుండా ఇలాగే ఆలోచించారు" అని జాన్‌కౌట్‌స్కీ తన From Marx to Mao (Soviet survey. June - July 1957) లో చక్కగా వివరించాడు.

2. లెనిన్ ఆదేశానుసారం, వెనుకబడిన రష్యాలో ఎంతో వత్తిడి, బలం ప్రయోగించి, పారిశ్రామికాభివృద్ధిని స్టాలిన్ సాధించాడు. ప్రజల ఆలోచనను అరికట్టి, వారిని బలవంతపెట్టి, స్వేచ్ఛలను అణచేస్తేకాని అంత పారిశ్రామికాభివృద్ధి సాధ్యంకాదు. పరిస్థితులే అలా ఉన్నాయి. ప్రొఫెసర్ పాల్ ఎ. బరన్ (మార్క్స్ వాది అయికూడా ఇంకా అమెరికాలోని ప్రధానమైన స్టాన్‌ఫోర్డ్ విశ్వవిద్యాలయంలో విద్యాబోధన చేస్తున్న ఏకైకవ్యక్తి) తన the Political Economy of Growth, New York, 1957, లో ఇలా వ్రాశారు : "ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి ముందు సోవియట్ యూనియన్‌లోను ఆతరువాత, తూర్పు, దక్షిణ యూరప్ దేశాల్లోను జరిగిన దారుణాలకూ దుష్కార్యాలకూ, స్టాలిన్, బెరియా, వారి ఇతర సహచరుల దుష్టబుద్ధే కారణమని చెప్పేవారు పైవ్యక్తులపై తమకున్న ద్వేషాన్నే ప్రకటిస్తున్నారని చెప్ప వలసి ఉంటుంది. అంత సులభంగా దాన్ని కొట్టివేయడానికి వీలు లేదు. ఆనాటి నాయకత్వం కొనసాగించిన ఘోరాలన్నింటికీ, నిజానికి ఆ దేశంలోని వ్యవస్థే కారణమనుకొంటే ఒప్పుకొన

వచ్చును. అయితే అంతమాత్రాన ఆ దేశంలో తొలగించవలసింది "సోషలిస్టు వ్యవస్థ"నే నని అనుకోవడం చాలా పొరపాటు. స్టాలిన్, అతని తొత్తులు చేసిన దుష్కార్యాలకు మూలం "సోషలిజం" కాదు. విదేశ దురాక్రమణాభయం ఆవహించి, అంతరంగికంగా తిరుగుబాటు చెలరేగిన స్థితిలో, వెనుకబడిన దేశాన్ని శరవేగంతో అభివృద్ధిపరచేటందుకు కొనసాగించిన ఉద్యమ ఫలితంగా ఏర్పడిన రాజకీయ వ్యవస్థవల్లనే అలాంటి దుస్సంఘటనలు దారుణాలు జరిగాయి.

ఈ రెండు సాంఘిక ప్రయోగాలవల్ల రష్యా రాజకీయార్థిక వ్యవస్థ ప్రస్తుత స్వరూపం దాల్చడానికి గల కారణాలు సుబోధక మౌతున్నాయి. వీటినే ఇతర కమ్యూనిస్టు రాజ్యాలు నకలు చేశాయి.

## ఇండియా నేర్చుకొనవలసిన పాఠాలు

ఇండియా, పారిశ్రామికంగా వెనుకబడిన ఇతర ఆసియా దేశాలు దీనితో నేర్చుకొనవలసిన గుణపాఠం ఒకటిఉంది. ఆసియాలోని దేశాలన్నీ పారిశ్రామికాభివృద్ధిని అతివేగంతో సాధించుకోవాలని కాంక్షిస్తున్నాయి. ఈ వేగాన్ని అతిగా హెచ్చిస్తే ఏం జరుగుతుందో రష్యా, ఆదికమ్యూనిస్టు దేశాలూ చూపుతున్నాయి. ఈ హెచ్చరికను గమనించి ప్రతిదేశం సోషలిజం సంస్థాపనకోసం ఏ మార్గం అవలబించుకోవాలో, ఏ సరళిన తమ పారిశ్రామిక వ్యవస్థను రూపొందించుకోవాలో నిర్ణయించుకోవాలి. పారిశ్రామికాభివృద్ధిని ఎంతవేగంగా సాధిస్తేనేం, ప్రజాస్వామ్యపద్ధతిని విడ

నాడకపోతే చాలుననుకుంటేకూడా పొరపాటే. ఈ పారిశ్రామికాభివృద్ధివేగాన్ని కొన్ని పరిధులను దాటిపోనిస్తే, నియంతృత్వం అవతరించే పరిస్థితు లేర్పడుతాయి.

ఈ విషయాలన్నింటినీ పరిశీలించినప్పుడు నా ఆలోచన వికేంద్రీకరణ, ప్రభుత్వాధికారాన్ని క్రమంగా తగ్గించడం మొదలయిన భావాలపై ప్రసరించింది. సమిష్టి వ్యవహారాల నిర్వహణకు, సంఘ వ్యవస్థాపనకు రూపాంతరాలు ఉంటాయేమోనని అన్వేషించాను.

సాంఘికవిప్లవం తేగల ఏ సాధనమైనా మార్క్సువాదానికి సమ్మతమే. ఇది నీతి బాహ్యమైనది. నీతిగురించి ఇలాంటి వైఖరి అవలంబించినందుకు మార్క్సువాదులను అందరూ ఖండించినా చరిత్ర ఆదికాలంనుంచీ పైకి ఏమిచెప్పినా, ఆచరణలో రాజకీయవాదులందరూ ఈ ధోరణిలోనే ప్రవర్తించారు. ఆశయసాధనకు ఏమార్గం అవలంబించినా, ఆశయం ఉన్నతమైనదయితే చాలునన్న భావమే ఈనాటికికూడా రాజకీయచర్యలకు పునాది. ఎప్పుడో గాంధీజీలాంటి ఏ మహాత్ముడో దారితప్పి రాజకీయక్షేత్రంలో ప్రవేశించి నప్పుడు రాజకీయాలను నీతితో అనుసంధించే ప్రయత్నం జరుగుతుంది.

రష్యాలో అవలంబించిన దుష్టసాధనాలవల్ల కలిగిన దౌష్ట్యాలు, ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీనుంచి ఏరివేతలు (Purges) చేసే సందర్భంలో అవలంబించిన దారుణాలు, చేసిన దుర్ంతాలు "విప్లవాత్మక నీతిశాస్త్ర బద్ధ"మైనవని చెప్పినపుడు నాకు అసహ్యం

కలిగింది. అసలు చెడుసాధనాలతో ఉన్నతాశయాలను సాధించడం ఎప్పటికైనా సంభవమా అనిపించింది.

ఇలాంటి శంకలు, పునరాలోచన కారణంగా నేను క్రమంగా గాంధీజీకి సన్నిహిత మవుతూవచ్చాను. అయితే నా విశ్వాసాలు పూర్తిగా మారనందున, ప్రజాస్వామిక సోషలిజమే తాత్కాలికంగా నాకు శరణ్యమైంది.

యూరప్‌లోని సోషలిస్టు ప్రజాస్వామ్య ఉద్యమాన్ని, బ్రిటిష్ ఫేబియనిజమును ఎక్కడికక్కడ సర్దుబాటు చేసుకునేవారి సోషలిస్టు తత్వాన్ని నేను గట్టి మార్క్సువాదిగా ఉన్నప్పుడు తీవ్రంగా విమర్శించాను. అందుకే నా తిరుగు ప్రయాణం సందర్భంలో, సంస్కరణ వాదపు, పునరుద్ధరణ వాదపు ఊబిలో చిక్కుకోకూడదని తలచాను. నా ఆలోచన ఇలా సాగింది. ఇప్పటికీ నా ఆశయం విప్లవకరమైన సోషలిజమే. దీనిద్వారా సమాజాన్ని సమూలంగా మార్చాలి. అయితే ఈ కార్యసాధనలో స్వాతంత్ర్యం, సమతా సౌభ్రాతృత్వంలాటి మహత్తరమైన మానవత్వ విలువలు పరీక్షింపబడతాయి. ఈ క్రొత్తరకమైన సోషలిజానికి ఒక నిర్దుష్ట రూపం కల్పించడం సులభం కానిమాట నిజమే. ఇది ఇంతవరకు సాధ్యపడలేదు.

## గాంధీజీ బోధల విలువ

యూరపు పెత్తనంనుంచి అసియా దేశాలు (కొన్ని మినహా) రాజకీయంగా విముక్తి సాధించుకున్న నాటినుంచి యూరపుకు చెందిన సోషలిస్టులు మన దేశాలకు తరచు వస్తూ

రకరకాల సలహాలు ఇస్తున్నారు. వారి సలహాలు, మిత్రత్వం మనకు సమ్మతమేకాని ఒక విషయాన్ని వారు మరువకూడదు. యూరప్‌లో కమ్యూనిజం వైఫల్యం చెందిందని చెప్పేటట్లయితే అక్కడ సోషలిజం కూడా చెప్పుకోతగ్గ విజయమేమీ సాధించ లేదని వారు గుర్తించాలి. అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమంలో జర్మన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీ అందరికీ గర్వకారణంగా ఉండేది. సోషలిస్టు చరిత్రలో మహనీయులైనవారు దాన్ని పెంచి పోషించారు. వీరిలో స్వయంగా ఎంగిల్సు ఒకడు. మార్క్సు తన "దాస్ కేపిటల్" మొదటి సంపుటాన్ని అంకితం ఇచ్చిన లిబెక్, నెచ్, బెబెల్, కౌట్‌స్కీ ఇంకా ఎందరో ఉన్నారు. అయినా ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం మొదటిసారిగా అధికారాన్ని చేపట్టే అవకాశాన్ని చరిత్ర ప్రసాదించినప్పుడు జర్మను సోషల్ డెమాక్రటిక్‌పార్టీ అతిఘోరంగా విఫలమైంది.

ఫ్రెంచి సోషలిస్టు ఉద్యమ చరిత్రకూడా ఎంతో శోచనీయమైనది. బ్రిటిష్ కన్సర్వేటివ్ ప్రభుత్వంతో చేతులు లిలిపి డై మోలె ప్రభుత్వం ఈజిప్టుపై దురాక్రమణకు కడంగడం, ఫ్రెంచి సోషలిస్టుపార్టీపై మాపుకోలేని మచ్చ. బ్రిటిష్ కార్మిక పక్షం అట్లీ నాయకత్వాన స్వదేశంలోను, అంతర్జాతీయంగాను కొన్ని చక్కని పనులు చేసింది. ఈజిప్టుపై దురాక్రమణ సందర్భంలో గెయిట్‌స్కెల్ ఇచ్చిన నాయకత్వం వల్లకూడా బ్రిటిష్ సోషలిస్టు ఉద్యమ ప్రతిష్ఠ ఇనుమడించింది. అయినా బ్రిటిష్ సోషలిస్టులు చేసిన మరుగు పరచలేని దారుణాలు చాలా ఉన్నాయి. సోషలిస్టు ప్రజాస్వామ్యం ఇంగ్లండులో ఇంకా నెల

కొనలేదు. కన్సర్వేటివులు నిరంతరం దుయ్యబెడుతున్న సంక్షేమ రాజ్యం సోషలిజమునకు ప్రత్యామ్నాయం కాజాలదు. మాక్మిలన్ అధ్వర్యాన ఈ సంక్షేమరాజ్యం కూడా "అవకాశాల రాజ్యం"గా రూపొందే ప్రమాదంలో పడింది. స్కాండినేవియను దేశాల్లో ముఖ్యంగా స్వీడెనులో ప్రజాస్వామిక సోషలిజం కొంత చెప్పుకో తగ్గ విజయాన్నే సాధించినమాట నిజమే. అయినా, సోషలిస్టు ఆశయాలన్నింటినీ వారు సాధించారని చెప్పలేము. స్వీడెను జనాభా చాలా తక్కువ కావడం, ప్రభుత్వ ప్రమేయంలేని సంస్థల్లో అంటే సహకారసంఘాల రూపంలో సోషలిజం ప్రవేశపెట్టాలనుకోవడం వల్లనే బహుశా ఆమాత్రమైనా స్వీడెనులో సామ్యవాదం విజయం సాధించిఉంటుంది. సోషలిజం, సర్వోదయంగా పరిణామం పొంద డంలో పై రెండు అంశాలు వహించదగుపాత్ర మహత్తరమైనది.

మార్క్సువాద బద్ధమైనా, ఇతరత్రా అయినా, యూరప్ లోని సోషలిస్టు ఉద్యమం ప్రధానంగా పారిశ్రామికంగా పురోగ మించిన సమాజములకు సంబంధించినది. పెట్టుబడిదారీవ్యవస్థ పరి ణతి చెందిన తరువాత వచ్చే దశ సోషలిజమని, మార్క్సు ఇతర యూరోపియన్ సోషలిస్టు ప్రవక్తలు భావించారు. ఆసియా దేశాల్లో పెట్టుబడిదారీ బద్ధమైన పారిశ్రామికాభివృద్ధి ఇంకా శైశవావస్థ లోనేఉంది. ఇవి ప్రధానంగా గ్రామీణవ్యవసాయకదేశాలు. ఇలాంటి వాతావరణంలో సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం గురించి యూరోపి యన్ సోషలిస్టులకు ఏమీ తెలియదు. కాగా ఈ విషయంలో వారు వహింపగల మార్గదర్శకత్వం ఏమీలేదు. వెనుకబడిన గ్రామీణ వ్యవస్థలు ఉన్న చైనా, రష్యాలలో అధికారం వశపర్చుకోవడం

వరకు కమ్యూనిస్టులు విజయం సాధించినమాట నిజం. కాని వీరు నిర్మించిన "సోషలిజం"లో సమత, సౌభ్రాతృత్వాలు శూన్యం. ఇవి లేని సోషలిజం నాకు ఊహాతీతం.

ఆసియా సోషలిస్టులు తమ సాధనోపాయాలను ఇక తామే అన్వేషించి నిర్ణయించుకోవలసివచ్చింది. అంటే పాశ్చాత్య సోషలిస్టు ఉద్యమంనుంచి కాని, రష్యన్ కమ్యూనిజంనుంచికాని మనం నేర్చుకోవలసింది ఏమీ లేదనికాదు. కాని మన ఆలోచన, ప్రయోగాలు, నూతన మార్గాన్వేషణ అన్నింటినీ ప్రధానంగా మనమే కొనసాగించాలి. ప్రధానమయినవిషయాల్లో నవ్యపంథాలో విచారణ చేసేపద్ధతి భారతసోషలిస్టుల్లో కొంతకాలంగా అడుగంటిపోయిందని నాకు తోస్తున్నది. ఇలాంటి ఆలోచనను తిరిగి చిగిరింపచేయాలి. (1) సాంఘిక విప్లవంకోసం గాంధేయపద్ధతి ఒకటి చూస్తున్నాము. భూదానం, గ్రామదానం, తరువాత గ్రామరాజ్య ఉద్యమరూపం ధరించిన గాంధీమార్గాన సాంఘిక పునర్నిర్మాణ పద్ధతినికూడా చూశాము. (2) ఆర్థిక ఉత్పత్తిసాధన లన్నింటిని ప్రభుత్వ యాజమాన్యంక్రింద కేంద్రీకృతమైన విస్తృత యంత్రాంగంతో నిర్వహించడమే సోషలిజమని భ్రమసిపోవడంవలన కలిగిన అనుభవ సంపదకూడా మన కున్నది. ఈ రెండింటి తోడ్పాటుతో మన ఆలోచనను మళ్ళీ ప్రారంభించాలి.

పైన నేను పేర్కొన్న ఈ పునఃపరిశీలన, కొత్తమూల్యాల నిర్ణయ యత్నం కా. సో. పార్టీలోను, పూర్వ సోషలిస్టుపార్టీలోను పనిచేసిన నా సహచరులందరూ సమిష్టిగా పొందిన అనుభవ ఫలితమే. ఈ అనుభవ ఫలితంగా కలిగిన భావాలనుకూడా పైన ఉద

హరించాను. ఇవీ అందరి ఆలోచన ఫలితాలే. ప్రజాస్వామ్యానికి ప్రాముఖ్యత, వికేంద్రీకరణావశ్యకత, ఆశయాలు ఉన్నతమైనవి అయితే అందుకు అవలంబించే సాధనలుకూడా ఉన్నతంగానే ఉండాలన్న గుర్తింపు—ఇవన్నీ సమష్టిగాపొందిన అనుభవ ఫలితంగా అందరికీ కలిగిన భావాలే. ఈ విధంగా మార్క్సిస్టు-లెనినిస్టు వాదప్రేరణతో బయలుదేరిన కా. సో. పార్టీ (C. S. P.) ఎన్నో అవతారాల అనంతరం, ప్రజాస్వామ్య సోషలిస్టు వాద పార్టీగా (P. S. P.) రూపం ధరించింది. ఇంతవరకు నా యాత్ర నా సహచరులు చూపిన సఖ్యత, అభిమానాలతో సంతోషప్రదంగా జరిగిపోయింది. అవన్నీ మధురస్మృతులుగా నాకు జీవితాంతం వరకు ఉంటాయి.

## సోషలిజంనుండి సర్వోదయానికి

కొన్ని సంవత్సరాలక్రితం నా ప్రయాణాన్ని మరొకదిశకు కొనసాగించవలసివచ్చింది. అప్పుడు నాదారి, నా సహచరులదారి విడిపోయాయి. నేను జీవనదానం చేసినప్పటినుంచీ ఈ విడిపోవడము ప్రారంభమయింది. జీవనదానం అంటే ఒక మహత్తర భావం స్ఫురిస్తున్నా, అధికారం పార్టీలపై ఆధారపడే రాజకీయాలకు స్వస్తిచెప్పి, నా శేషజీవితాన్ని భూదానం, సర్వోదయ ఉద్యమాలకు అంకితం చేయాలను నిశ్చయాన్నిమాత్రమే ఇది సూచిస్తున్నది.

ఏ స్వాతంత్ర్యం, సమతా సౌభ్రాతృత్వ దీపికలు అదివరకు నాజీవితయాత్రకు వెలుగుబాటను చూపి, ప్రజాస్వామిక సోషలిజం

వైపు తీసుకువెళ్లాయో, ఆదీపికలే నా ఈ నూత్న దిశనుప్రయాణానికి ప్రేరణనిచ్చాయి. గాంధీజీ సజీవంగా మన మధ్యలో ఉన్నప్పుడే నా జీవనయానం ఈ దశ నెందుకు చేరలేదనే నా విచారం. ఏమైనప్పటికీ, మనం నేడు ఆకళింపు చేసుకున్న సోషలిజం, మానవత్వాన్ని స్వేచ్ఛ, సమతా సౌభ్రాతృత్వం, శాంతిలాంటి మహోన్నతాశయాలవైపు తీసుకువెళ్ళజాలదని కొన్ని సంవత్సరాలక్రితమే నాకు స్పష్టపడింది. ఇతర సాంఘికోద్యమాలకంటే, సోషలిజమే మానవలోకాన్ని ఈ ఆశయాలకు దగ్గరగా తీసుకువెళ్ళగలదని మాత్రం భావించవచ్చును. కాని సోషలిజం సర్వోదయంగా మార్పు చెందకపోతే, ఈ ఆశయాలను చేరుకోలేమనే విశ్వాసంమాత్రం నాకు కలిగింది. స్వాతంత్ర్యావతరణ మనందరి ఆశల నెలా వమ్ము చేసిందో, అలాగే సోషలిజంకూడా వచ్చే తరాలవారికి ఆశాభంగాన్ని కలిగించవచ్చును.

పూనాలో నేను మూడు వారాల పాటు చేసిన నిరశనవ్రతం సందర్భంలో మార్క్సువాదానికి పూర్తిగా తిలోదకాలు విడిచాను. రష్యాలో జరిగిన ఏరివేతల నాటి నుంచి నాలో ఉదయించిన ప్రశ్నపరంపరలు అప్పటికి సమసిపోయి, భౌతికవాదాన్ని తాత్విక దృక్పథంగా స్వీకరిస్తే నీతిబద్ధమైన నడవడికి కాని, మంచితనానికి కాని ఆస్కారం ఉండదన్న నిర్ణయానికి వచ్చాను.

మానవుడు అతని జాగ్రదావస్త, అతను నిర్మించిన సమాజము, సంస్కృతి ఇవన్నీ కేవలం భౌతికమేయై పదార్థపు స్వభావ ప్రకృతాది మార్పులే అయితే, ఈ విషయాన్ని ఎంత తార్కి

కంగా చెప్పినా, ఇలాంటి సమాజంలో ఏవ్యక్తి అయినా ఎందుకు మంచిగా, అంటే ఉదారంగా, దయార్ద్రంగా, స్వార్థరహితంగా ఉండాలి? దుర్బలురు, బీదలు అయినవారిపట్ల ఎందుకు సాను భూతి వహించాలి? అంతా పదార్థమే అయితే ఒక పదార్థం మరొక పదార్థంలో, మరణం తరువాత, కరిగిపోవాలి. కాబట్టి నీతిబద్ధమైన ప్రవర్తనకు ప్రేరణ ఎక్కడినుంచి వస్తుంది? అధి కారంకోసం లేక సంపదకోసం లాలస ఉంటే, ప్రజల మన్ననలను లేక నీకు పెద్దలైనవారి అభిమానాన్ని చూరగొనాలంటే, అందుకు తగిన పనులు చేయాలన్న ప్రేరణ నీకు కలగవచ్చు. కాని ఇలాంటి పనులకు, చర్యలకు మంచి చెడుల విచక్షణకు సంబంధం ఉండదు. నైతిక భావాలకు చరిత్ర ఉన్నమాట నిజం. అవి సాంఘిక జీవన జనితాలే. అయినా తన పూర్వుల ప్రవర్తన ప్రమాణాలనే తానుకూడా ఎందుకు ఆచరించాలి? అసలు తను నీతిబద్ధంగా ఎందుకు ప్రవర్తించాలి? అని ఏవ్యక్తి అయినా ప్రశ్నిస్తే, భౌతికవాదం ఇచ్చే సమాధానమేమీ ఉండదు. సాంఘిక సేవ, త్యాగం, స్వేచ్ఛ సమతల్లాంటి ఆదర్శాలు కల వాతావర ణంలో పెరిగిన వ్యక్తి వాటినుంచే ప్రేరణ పొందవచ్చును. కాని ఈ ఆదర్శాలను తనెందుకు విశ్వసించాలి, వాటివల్ల కష్ట నిష్ఠు రాలకు ఎందుకు గురికావాలి అని కొంతకాలం తరువాత ఆవ్యక్తి ప్రశ్నించుకుంటే, భౌతికవాదంకాని గతితార్కిక భౌతికవాదం కాని సంతృప్తికరమైన సమాధానం ఇవ్వలేవు. అంటే భౌతిక వాదుల్లో ఉదాత్తమైన ఉద్యమాలకోసం మహత్తరమైన త్యాగాలు చేసినవారు లేరని నే ననడంలేదు. ఇలాంటి మహనీయుల చర్యలు

వారి వాదానికి, తత్వానికి అనుగుణంగా లేవని మాత్రమే నేను చెబుతున్నాను.

## మానవుడు యాంత్రిక జీవి కాదు

'మానవుడు స్వశక్తిపై సంచరించే యంత్రం మాత్రమే, అతని ప్రవర్తనకు కట్టుబాట్లు ఉన్నాయి, అతనికి స్వేచ్ఛ కాని ఆత్మశక్తికాని లేవు' అనుకుంటే ఒకరకంగా సమాధానం లభించవచ్చును. ఈ విధమైన భావనతోనే, ప్రపంచంలో పీడనకు గురియైన దీన జనావళికోసం మార్క్స్ లెనిన్‌లు కష్టించి త్యాగాలు చేశారు. కాని ఎంత కరుడు గట్టిన మార్క్స్ వాదియైనా మానవుణ్ణి ఇలా యంత్రమాత్రుడని అంగీకరిస్తాడనుకోను. నిజానికి మార్క్స్ ప్రతిపాదించిన విప్లవ నాయకత్వ సిద్ధాంతమే స్వతంత్ర భావనపై ఆధారపడి ఉంది.

జడము, చైతన్యము వీటిలో ముందు ఏది వచ్చిందనే ప్రశ్నపై వేదాంతశాస్త్రంలో బ్రహ్మాండమైన వివాదం ఉంది. అసలు విషయమేమిటంటే, ఏది ముందువస్తేనేం, నేటి సృష్టిలో ఉన్న కొన్నింటిని జడమూ అనవచ్చును, చైతన్యమూ అనవచ్చును. చైతన్యం పుట్టుక ఏదైనప్పటికీ, చైతన్యాన్నికూడా, జడమువలెనే అవగాహన చేసుకోవచ్చునని భావించి మార్క్స్ వాదం పొరబాటు చేసింది. జడపదార్థముల ధర్మాలనే జాగ్రదావస్థలకు అన్వయింపలేమని మార్క్స్ వాదం గుర్తించలేదు. పదార్థం గూర్చి చేసే పరిశోధన పరాశ్రయమైనది. కాని చైతన్యావస్థ గురించే చేసే సంశోధన ఆత్మజ్ఞానోదయానికి సంబంధించినది. పదార్థంగూర్చి

చేసే అన్యమైన పరిశోధనే, క్లుప్తంగా చెప్పాలంటే, నేటి విజ్ఞాన శాస్త్రం (Science); ఇది నీతిబాహ్యమైనది. చైతన్యాన్నికూడ ఒక పదార్థ ధర్మంగా భావించి, మార్క్సువాదులు (సాధారణంగా భౌతికవాదులందరూకూడా) నీతిశాస్త్రానికి ఆధారంలేకుండా చేశారు. వీరికొక వైప్లవికనీతి (Revolutionary Ethics) ఉన్నమాట నిజం. దానిగురించి వారు చాలా చెబుతారు. కాని ఇది, ఏవిధంగా నైనా ఆశయసాధనే ప్రధానమనేసిద్ధాంతానికి స్థూలరూపంమాత్రమే. తను విప్లవ పక్షంలో (లేక పార్టీ, ప్రజల పక్షంలో) ఉన్నానని నమ్మకం ఒక వ్యక్తికికలిగితే ఇక ఎంతటి దురంతమైనా చేసే స్వేచ్ఛ అతనికి ఉంటుంది. ఇదే వారి వైప్లవిక నీతి.

మార్క్సిస్టులు భౌతిక వాదులు. వారితో తాత్వికంగా విభేదించే ఇతర్లుకూడా చైతన్యావస్థను విజ్ఞానశాస్త్రపద్ధతులద్వారా అవగతం చేసుకోవాలని యత్నిస్తున్నారు. కాబట్టి మానసికశాస్త్రంలో కూడా నైతిక ప్రవర్తనకు మూలం కనబడదు. ఆత్మగతంగా అనుభూతి పొందవలసిన చైతన్యావస్థను విజ్ఞానశాస్త్రం అవగతం చేసుకొనడం ఎన్నటికీ సాధ్యం కాదు. ఈ ఆత్మానుభూతిని, దాని నైజాన్నిబట్టే భౌతికవాద పరిభాషలో వ్యక్తీకరించడం అసాధ్యం, ఇందుకనే ఈ ఆత్మాశయమయిన సత్యానుభూతిని, ఈ పరమ సత్యానుభూతిని పొందిన యోగులు, మాయావాదులు ఎవరూ ఏ భాషలోను వ్యక్తం చేయలేకపోయారు. "The Philosopher thinks his philosphy; the sage lives his wisdom" అన్నాడు రోగర్ గోడెల్.

పదార్థము - చైతన్యము

నవీన విజ్ఞానశాస్త్ర పరిశోధనలో మానవుడు ఎంత పురోగమించాడంటే ఇక జడము, భావము (చైతన్యము) మధ్యగల ద్వంద్వం కనబడనంతగా క్షీణించింది. రోగర్ గోడెల్ తన "The Contemporary science and the liberative Experience of Yoga" లో ఇలా అన్నారు :

"భౌతిక శాస్త్రవేత్త బాహ్యమయిన విశ్వరూపాన్ని అందలి వస్తు ధర్మాలను పరిశోధిస్తున్నప్పుడు అతనికి విభ్రాంతి కలిగించు సందర్భ మొకటి ఏర్పడుతుంది. అప్పు డతనికి కనబడేది ఒక అస్పష్టమయిన విశ్వం మాత్రమే. ఆ విశ్వంలోని సృష్టివైచిత్రి, దాన్ని అవలోకిస్తున్న వ్యక్తి, ఉభయులూ విడదీయరానివిధంగా సమ్మిశ్రితమై ఉంటారు. వీరు అత్యంత సన్నిహితులై ఉండడం వలన ఒకరి ప్రతిబింబం మరొకరిలో ద్యోతక మవుతుంది. కాని విడిపోవడానికికాని, సంలీనం కావడానికికాని ఇరువురికీ శక్తి ఉండదు.

"పరస్పర వైరుధ్యాలను సూచించే మన నిత్యజీవితాను భవంలోని చిహ్నాలు, ఈ అనిశ్చితస్థితిలో మటుమాయమైపోతాయి. జడచైతన్యములు తమ నిజభావాలను వదులుకోవాలంటే ఎంతో ప్రగాఢమయిన మార్పు పొందవలసి ఉంటాయి. చైతన్యం, జడంగా కుంచించుకు పోతుంది ; జడం, జడత్వాన్ని వదలి ప్రకాశమై (Radiation) పోతుంది. ఆకాశ-కాలమానమందు వ్యాప్తికొరకై కాంతి కిరణముల అలలకు ఘన, ద్రవ్య, వాయు పదార్థముల ఆధారమేదీ అవసరము లేదు. నీటిపై పిల్లకెరటాలతో వాటిని

పోల్చుట యథార్థముకాని సాదృశ్యముమాత్రమే. నిజానికి అవి మన ఆలోచనలు దూరమునకు ప్రతిబింబింపజేయు చైతన్యము, సంభావ్యమునకు చెందిన అలలు. నిరపేక్ష కార్యధర్మములలోని వక్రపు, దీర్ఘపు మార్పులు మాత్రమే."

ఈ ద్వంద్వత్వాన్ని విజ్ఞానశాస్త్రం పూర్తిగా తొలగించలేదు. బహిర్గతమైన పరాశ్రయ పరిశీలన చేసేటప్పుడు, పరిశీలకుడు అతను పరిశీలిస్తున్న పదార్థము, ఎంత "విడదీయరానివిధంగా సమ్మిశ్రితమై" ఉన్నప్పటికీ వేర్వేరుగా నుండకతప్పదు. ఆధ్యాత్మికమైన చరమానుభూతిలోనే ఈ ద్వంద్వమును త్యజించి, పరిశీలకుడు, అతను పరిశీలిస్తున్న పదార్థము ఏకమైపోతాయి.

ఈ ఐక్యానుభూతిని పొందేటందుకు మానవుడు చేసే యత్నంలోనే నీతికి ప్రాతిపదిక ఉంటుంది. ఈ ప్రయత్నాన్నే ఆత్మజ్ఞానార్జన అంటారు. ఈ ఐక్యతానుభూతిని పొందినవ్యక్తికి నీతివర్తన సహజమై, సునాయాసంగా వస్తుంది.

ఆర్థిక రాజకీయ రంగాలలో జరిగే ఉద్యమాలకూ పై విషయాలకూ సంబంధం ఏమిటని కొందరనవచ్చును. వీరితో నేను విభేదించక తప్పదని నమ్రతాపూర్వకంగా చెప్పక తప్పదు. వ్యక్తిగతమైన చర్యలు ఆర్థిక, రాజకీయ, ప్రజారంగాలలోను, ఇతరత్రాను చేసే చర్యలు పరస్పర వైరుధ్యం లేకుండా సమైక్యమై ఉండాలి. ఈ సమైక్యతకు మూలంగా ఒక జీవనతత్వం ఉండాలి.

## కోరికల పరిమితి - సోషలిజము

ఇలా ఆలోచించినప్పుడు, ప్రజాఉద్యమానికి సంబంధించిన ఆర్థిక, సాంఘిక పునర్నిర్మాణం సమస్యవైపు మనదృష్టి పోతుంది.

కమ్యూనిస్టులు, సోషలిస్టులు ఉభయులు దీనిపట్ల అశ్రద్ధవహించారు. భౌతిక సిరిసంపదలు, ఉత్పత్తి నిత్యాభివృద్ధి చెందాలనీ జీవన ప్రమాణం సదా హెచ్చుతూ ఉండాలనీ కమ్యూనిజము, సోషలిజము నొక్కిచెబుతున్నాయి. మానవుని భౌతికావసరాలను న్యాయమైనంత వరకు తీర్చవలసిందే. కమ్యూనిస్టులు, సోషలిస్టులు మొదటినుంచీ బీదల, శోషిత ప్రజల పక్షం వహిస్తున్నారు కాబట్టి, భౌతికంగా ప్రజల అభ్యుదయానికి సౌఖ్యానికి వారిచ్చే ప్రాముఖ్యతను అర్థం చేసుకోవచ్చునుకూడా. ఇండియాలాంటి బీద, వెనుకబడిన దేశాల్లో కొనసాగించవలసిన సాంఘిక పునర్నిర్మాణంలో, ప్రజల జీవన ప్రమాణాన్ని బాగా హెచ్చించడమే ప్రధానకర్తవ్యమైన మాటకూడా నిజమే. అయినా ఇలాంటి దేశాల్లో కాని, మరెక్కడ కాని భౌతిక సౌఖ్యాన్నే పరమాదర్శంగా చేసి, భౌతిక సిరిసంపదలకోసం తీరని దాహాన్ని ప్రజల్లో ప్రోత్సహించడం తగదు. ఈ దాహం తపింప చేస్తున్నంతవరకు మానవుల హృదయాల్లో కాని, మానవుల మధ్య కాని శాంతి ఉండదు. ఇందువల్ల వ్యక్తుల మధ్య, దేశాల మధ్య తప్పనిసరిగా పోటీ ఏర్పడుతుంది. ఈ పోటీని ఎవరూ అదుపులో పెట్టలేరు. ప్రతివ్యక్తి తనతోటి వానిని మించిపోవాలని భావిస్తాడు. ప్రతిదేశం తోటి దేశంతో సమానంగా ఉండాలనుకోవడమే కాక ఇంకా ముందుకు పోవాలని ప్రయత్నిస్తుంది. ఇలా విశ్రాంతిలేని సమాజంలో దౌర్జన్యం, యుద్ధం నిరంతరమై పోతాయి. ఇంకా సంపాదించాలనే వాంఛ ఎదుట జీవన విలువ లన్నీ మరుగున పడిపోతాయి. మతము, కళలు, తత్వశాస్త్ర ములు అన్నీ ఈ ఏకైక ధ్యేయాన్ని సాధించడానికే తోడ్పడవలసి

వుంటుంది. ఈ భౌతిక వాద ప్రవాహంలో స్వేచ్ఛా, సమత, సౌభ్రాతృత్వ భావాలు కొట్టుకొనిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. జీవితంలో నిండుతన ముండదు. నిజమైన తృప్తి ఉండదు.

జీవితంపట్ల కేవలం భౌతికవాద దృష్టి వహించడంవల్ల కలిగే ప్రమాదం గుర్తించిన సోషలిస్టులు చాలామంది అదివరకు ఉన్నారు; ఇప్పుడూ ఉన్నారని నాకు తెలుసు. అయినా జీవితపు భౌతికావసరాలపట్లనే సోషలిజం ప్రధానంగా శ్రద్ధవహించింది. సోషలిస్టు పక్షాలు, కార్మిక పక్షాలు, కార్మిక సంఘాలు, ప్రజల్లో అన్నీ సమపాళంలో ఉన్న పరిపూర్ణ జీవితం గురించి ప్రబోధం చేయవు. సోషలిస్టు ఉద్యమం ఈ విషయాన్ని తెలుసుకుంటే, విజ్ఞాన శాస్త్రం, పరిశ్రమాభివృద్ధి, సాంఘిక వ్యవస్థ, అంతర్జాతీయ సంబంధ బాంధవ్యాల గురించిన దానివైఖరి విప్లవాత్మకమైన మార్పు చెందుతుంది.

నీతిబద్ధమైన జీవనానికీ, మానవ వ్యక్తిత్వం, మానవుని గుణాలు, విలువలు వికసించడానికీ శారీరక వాంఛలను అదుపులో పెట్టడం అత్యంత అవసరం. సోషలిస్టు విలువలు పెంపొందడానికి ఇలాంటి క్రమశిక్షణావశ్యకత విశేషంగా కలదు. సమష్టి కృషి వలన కలిగిన సత్సంపదలను అందరూ కలిసి పంచుకొనడమే సోషలిస్టు జీవన విధానం. ఎంత స్వచ్ఛందంగా ఈ పంపకం జరుగుతే సమాజంలో అంతగా ఘర్షణ, ఉద్రిక్తత తగ్గిపోతాయి. సోషలిజం నెలకొంటుంది. సమాజంలో వ్యక్తులు తమ అవసరాలను అదుపులో పెట్టుకోకపోతే, స్వచ్ఛందంగా అందరూ పంచుకోవడం అసాధ్యంకాకపోయినా దుస్తరమవుతుందని నా నమ్మకం.

అలాంటప్పుడు సమాజం రెండుగా చీలిపోతుంది. ఒకరు ఇతర్ల వాంఛలను అదుపులోపెట్టాలని చూస్తారు. దానికి గురియైనవారు ఇంకొకరు. ఇలా రెండు చీలికలు ఏర్పడినప్పుడు, ఈ అదుపులో పెట్టేవారిని ఎవరు అదుపులో పెడ్తారు?—పాలకులను పాలించేది ఎవరు?—అను ప్రశ్న ఉదయిస్తుంది. కమ్యూనిస్టు దేశాలను, సోషలిస్టు ప్రభుత్వాల అనుభవాలను చూస్తే శాశ్వతమైన ఈ ప్రశ్నకు సమాధానం లభించడం చాలా కష్టం. ప్రతి వ్యక్తి క్రమశిక్షణను, సోషలిస్టు విలువలను అలవర్చుకొని, తోటివారితో స్వచ్ఛందంగా భాగస్వామ్యం పొంది సహకరించే టట్లు చూసి, ఈ క్రమశిక్షణను పైనుంచి అమలుజరపవలసిన ఆవశ్యకతను, అలాంటి ప్రాంతాన్ని వీలయినంతగా పరిమిత పరచడ మొక్కటే తగిన పరిష్కారంగా కనబడుతున్నది.

## పార్టీ రాజకీయాలు - పార్టీరహిత రాజకీయాలు

ఈ దృష్టితో చూచినప్పుడు సర్వోదయమూ, సోషలిజమూ అంటే ఏమిటి, అధికారబద్ధమైన పార్టీరాజకీయాలు, అధికారానికి కాని పార్టీకికాని సంబంధంలేని రాజకీయాలంటే ఏమిటి? అసలు రాజనీతి, లేక వినోబా అనే లోకనీతి (ప్రజానీతి) అంటే ఏమి టన్న మూలప్రశ్న ఉదయిస్తుంది.

మొదటనుంచీ నా ఆదర్శాలైన స్వేచ్ఛా సమత, సౌభ్రాతృత్వాలను రాజకీయాలద్వారా సాధించలేమని నాకు స్పష్టపడి నందుననే, పార్టీకోసం అధికారంకోసం ఆచరించే రాజకీయాల

నుంచి తప్పుకోవాలని నిశ్చయించుకున్నాను. అంతేకాని విసుగుదల నిస్పృహవల్ల కాదు.

అయితే రాజకీయాలకు ప్రత్యామ్నాయంగా, ఏమైనా ఉన్నదా? మార్పులుతెచ్చి సమాజాన్ని పునర్నిర్మించేటందుకు రాజ్యాధికారం వినా మరేదైనా సాధనం ఉన్నదా? రాజకీయాలంటే రాజ్యాధికారానికి సంబంధించిన నీతిమాత్రమే కదా!

దీనికి ప్రత్యామ్నాయం ఒకటి ఉందని గాంధీజీ మనకు చూపారు. అదివరకు నాకిది విస్పష్టంగా తెలియలేదని నేను ఒప్పుకోవాలి.

మన స్వాతంత్ర్య సమరం జరుగుతున్నప్పుడు, సాయుధ సంఘర్షణ కాక మరొకమార్గం ఉందని గాంధీజీ మనకు చూపారు. ఆ మార్గంలో నమ్మకం ఏర్పడి కాక, ఆ మార్గం సాఫల్యాన్ని సాధిస్తున్నదనే, ఆయన్ను మన మనుసరించాము. విజయంకంటె ఆశాజనక మేముంటుంది? ప్రజలను అపూర్వంగా సచేతనం చేస్తూ గాంధీజీ సత్యాగ్రహోద్యమాలు విజయం సాధిస్తున్నాయి. ఆనాడు ఇతర్లు ఆచరించిన కార్యక్రమాలు, ఉద్యమాలు ఓటమి అంగీకరించి, వెనుక పడిపోవలసి వచ్చింది.

## గాంధీజీయొక్క లోకసేవక సంఘం

కాని సమాజాన్ని మార్పుచేసి, పునర్నిర్మించేటందుకు అహింసాయుత పద్ధతిని ప్రదర్శించే సమయం గాంధీజీకి లేకపోయింది. ఇలాంటి పద్ధతి గురించి ఆయన చేసిన ప్రబోధాలు చాలా ఉన్నాయి. కాని వాటిని ఆచరణలో పెట్టకముందే, అతిఘోరంగా

నిర్యాణం చెందారు. అప్పటి పరిస్థితులను ఇప్పుడు పర్యాలోకిస్తే, తన భవిష్యత్ కార్యవిధానానికి ఆయనప్పుడే పునాదులు వేయ నారంభించారని కనపడుతోంది. అయితే ఇతర్లవలెనే నేనుకూడా, ఆయన ఉద్యమిస్తున్న కార్యవిధానం ప్రాముఖ్యతను అప్పుడు గుర్తించలేకపోయాను. తను నాయకత్వం వహించిన స్వాతంత్ర్యోద్యమం అద్భుత విజయం పొందినప్పటికీ, తన ఆదర్శాలకనుగుణంగా దేశాన్ని పునర్నిర్మించేటందుకు, రాజకీయాధికారాన్ని ఆయన ఎందుకు చేబట్టలేదో, నేను గమనించలేదు. అలాగే, కాంగ్రెసు రాజకీయాలనుంచి తప్పుకొని పునర్నిర్మాణ కార్యభారం వహించాలనీ, లోక్ సేవక్ సంఘంగా మారిపోవాలనీ ఆయన చేసిన ప్రతిపాదనకూడా ఎంత ముఖ్యమైనదో నేను గుర్తించలేకపోయాను. ఆయన హఠాన్మరణంవలన దేశమంతా దుఃఖసముద్రంలో మునిగిపోయినందున మరెవరు కూడా ఈ విషయమై సావకాశంగా ఆలోచించలేదు. అంతేకాక ఆయన తరువాత నాయకత్వం వహించవలసిన వారిదిక్కుకే ప్రజలందరూ చూశారు. కాని వారిలో ఎవరూకూడా గాంధీజీ చివరి సారిగా ఇచ్చిన సందేశం గురించి నోరు కదపలేదు.

గాంధీజీకి సన్నిహిత సహచరులందరూ, సాధారణ పార్టీ రాజకీయాలనే ఆచరిస్తున్నందున, వీటికి ప్రత్యామ్నాయంగా గాంధీవాదం చూపగల మార్గం వేరే ఒకటి ఉంటుందని కూడా ఎవరూ ఊహించలేకపోయినారు.

తన జీవితాన్నంతా రాజకీయాలకు అంకితం చేసిన గాంధీజీ, రాజకీయాలుకాక మరొక పద్ధతి దేన్నయినా ప్రతిపాదిస్తారని అసలు

ఎందుకు ఊహించాలని కూడా కొందరు ప్రశ్నించవచ్చును. కాని సాధారణంగా మనకు కనపడే రాజకీయాలతో గాంధీజీకి ఎప్పుడూ సంబంధం లేదని నా అభిప్రాయం.

భారత జాతీయ స్వాతంత్ర్యమే గాంధీజీ సాగించిన స్వాతంత్ర్యోద్యమ లక్ష్యం కాబట్టి అంతవరకు అది "రాజకీయ" మైనదే. అయితే ఏ ఒక్క పార్టీయో అధికారాన్ని కైవసం చేసుకునేందుకు సాగించిన ఉద్యమ "రాజకీయాలు" కావు. అధికారం సాధించడమే ఈ ఉద్యమ లక్ష్యమైనప్పటికీ, పాకిస్తాన్‌లోని వారితోసహా భారత ప్రజలందరికీ, అప్పుడు ఉన్న రాజకీయ పక్షాలన్నింటికీ, ఇకముందు ఏర్పడే పక్షాలకుకూడా ఈ అధికారం చెందాలని ఆయన భావించారు. తన పార్టీకే అధికారం రావాలని పోరాడి, అందుకై ఎత్తుకు పైఎత్తులు వేస్తూ పనిచేసే పార్టీ నాయకుడు కాదు గాంధీజీ. అలా కాకపోతే ఆయన కాంగ్రెసును అధికారంకోసం సాగే రాజకీయాల నుంచి వైదొలగమని సూచించేవారు కాదు. జాతీయ నాయకుడుగా దేశ స్వాతంత్ర్యంకోసం ఆయన సమరం సాగించారు. అంతేకాదు సకల మానవకోటి కధినేతగా తన తోటిమానవుల బంధవిముక్తి కోసం కృషి చేశారు. భారత స్వాతంత్ర్యోద్యమం అక్షరాల ప్రజా ఉద్యమం. అది రాజనీతికాదు, లోకనీతి— అంటే ప్రజానీతి.

## పార్టీ పద్ధతి

ఏమైనప్పటికీ, రాజకీయ సమస్యలతో నేను తలబడుతున్న రోజు లవి. అవి నాలో ఎంతో అసంతృప్తిని కలిగించి, వేరే మార్గం అన్వేషించమని ప్రేరేపించాయి. అధికారంకోసం పడే యాతనల

వల్ల అవినీతి, క్షీణింపు కలుగుతాయి. ఇలాంటి దశలో ఉన్న మనపార్టీ నాకు చాలా ఆందోళనను కలిగించింది. ధనం, వ్యవస్థ, ప్రచార సాధనలు ఉన్న పార్టీలు ఏవిధంగా ప్రజలనెత్తినెక్కి సవారీ చేయకలవో నేను చూశాను. ఈ విధంగా ప్రజారాజ్యం పార్టీరాజ్యంగా ఎలామారుతుందో చూశాను. పార్టీరాజ్యం ఆతరువాత ఒక వర్గం, ఒక ముఠా రాజ్యంగా మార్పుచెందింది. ప్రజాస్వామ్యం, వోట్లు వేయడంవరకే మిగిలిపోయింది. శక్తివంత మైన పార్టీలే అభ్యర్థులను నిలబెడ్తాయి. వీరిలోనుంచే చాలావరకు వోటర్లు ఎవరినైనా ఎన్నుకోవాలి. ఈ విధంగా ఈ వోటు హక్కు కూడా పరిమితమైపోయింది. ఏ సమస్యపై వోట్లు అడుగుతారో, అవి వోటర్లకు అర్థంకానివి అవడంవలన ఈ మాత్రం స్వేచ్ఛకూడా నిరర్థకం, అవాస్తవికమైపోయింది.

నేను చూచిన పార్టీపద్ధతిక్రింద ప్రజలు దుర్బలులై పోయారు. ప్రజాబలం హెచ్చి, వారికి చొరవఏర్పడి, ప్రజారాజ్య మేర్పడి వారి వ్యవహారాలను వారే నిర్వహించుకోగల సామర్థ్యాన్ని కలిగించడంలో తోడ్పడేవిధంగా పార్టీపద్ధతి పనిచేయడంలేదు. పార్టీలకు కావలసిందల్లా, ప్రజల అంగీకారంతోనే కావచ్చు, అధికారం చేబట్టి ప్రజలపైన పరిపాలనచేయడమే. ఈ పార్టీ విధానంక్రింద ప్రజలు ఒక గొర్రెలమంద అని, అప్పుడప్పుడు తమ యోగక్షేమాలను చూచే కాపరులను ఎన్నుకొనడంవరకే వీరి సర్వస్వాతంత్ర్యం పరిమితమౌతుందని నాకు తోచింది. ఏ స్వాతంత్ర్యంకోసం, ఏ స్వరాజ్యంకోసం నేను, ప్రజలు పోరాడామో అది ఈ పార్టీపద్ధతిలో నాకు కనపడలేదు.

వికేంద్రీకృత అధికారం కల చతుర్స్తంభ రాజ్యంలాంటి భావాలగురించి ప్రజాస్వామిక సోషలిస్టులు చెబుతూవచ్చారు. అయినా వారి ప్రధానకోరిక అప్పటికీ ఇప్పటికీ అధికారం వశపర్చు కొనడమే. అధికార వికేంద్రీకరణకోసమైనా, ప్రస్తుత అధికార కేంద్రాలను వశపర్చుకోవాలనీ, అప్పుడే శాసనాలద్వారా కేంద్రీ కృతాధికారం కల సంస్థలను తొలగించి వికేంద్రీకరణ నమలు జరుపవచ్చుననీ వీరి భావన. ఈ కార్యవిధానం ఎంత అర్థరహిత మైనదో వారు గుర్తించడం లేదు. అధికారమంతా శిఖరాగ్రంలోనే కేంద్రీకృతమై ఉన్నందుననూ, పార్టీ విధానంవల్లనూ రాజకీయంగా బలహీనులై, తమను తామే పాలించుకునే శక్తిని దాదాపు కోల్పోయివున్న ప్రజలకు పైనుంచి అధికారాన్ని ధారపోసి, వికేంద్రీకరణను సాధించలేము. మన శాసనసభల్లో చేసిన చట్టాల ద్వారా గ్రామ పంచాయతీలను ఏర్పాటుచేస్తున్నారు. ఇవి నిజంగా గ్రామ పంచాయితీలు కావు. వీటిలో గాంధీజీ కోరిన గ్రామరాజ్యం లేదు.

తను రూపొందించుకున్న చట్టంక్రిందనే గ్రామ పంచాయితీ పనిచేయగలదని గాంధీజీ అన్నారు. ప్రజలు తమ వ్యవహారాలను తామే క్రమబద్ధ మొనర్చుకునే ఈ శక్తి వికేంద్రీకరణ పేరుతో పైనుంచి ప్రసాదిస్తే రాదు. దాన్ని సృష్టించాలి. ఈ ఉద్యమం అడుగునుంచి ప్రారంభం కావాలి. స్వపాలన, స్వనిర్వహణలకు సంబంధించిన కార్యక్రమాన్ని ప్రజలముందు పెట్టి, నిష్పాక్షికమైన నిర్మాణాత్మక పద్ధతిన ఈ కార్యక్రమాన్ని ఆచరించుకొనడంలో వారికి సహాయపడాలి. ఇలాంటి కార్యక్రమాన్ని దేశమంతా అమలు

పర్చడానికే కాంగ్రెసును లోక్ సేవక్ సంఘంగా రూపొందించా లని గాంధీజీ ఆలోచించారని ఇప్పుడు స్పష్టంగా తెలుస్తున్నది. సరిగా ఈ కార్యభారాన్నే వినోబాజీ వహించారు. గాంధీజీకి ఉన్న విజయావకాశాలు వినోబాకు లేవు. ఇది సహజంకూడా. అయినా ఆరు సంవత్సరాల స్వల్పకాలంలోనే సాంఘిక విప్లవోద్యమాన్ని, పునర్నిర్మాణోద్యమాన్ని అడుగునుంచి నిర్మించడంలో వినోబా కృతకృత్యుడైనారు. క్రొత్త లోక్ సేవక బృందాన్ని సృష్టించారు.

పార్టీలు పరస్పర పోటీలు పడడంకంటే సహకరించుకుంటే, పార్టీ పద్ధతిలోని లోపాలు తొలగిపోతాయేమోనని కొంతకాలం ఆలోచించాను. అయితే సహకారాత్మకమైన ఇలాంటి రాజకీయ ప్రయోగం చేయడానికి తగిన వాతావరణం కనబడలేదు. అధికారం కోసం జరుగుతున్న నేటి ఘర్షణలోను, పార్లమెంటరీ ప్రజాస్వామ్య పద్ధతిలోను ఏదో ఒక పరిమితమైన లక్ష్యంకోసం కొంతకాలం వరకే ఇలాంటి సహకారం ఉండగలదు. అయినా తగిన మానసిక వాతావరణమే ఉంటే ఇలాంటి రాజకీయ ప్రయోగాన్ని చేసి చూడ వచ్చునని ఇప్పటికీ నా విశ్వాసం. కాని ఇందుకోసం ఇప్పటి పార్ల మెంటరీ ప్రజాస్వామ్యంలో మార్పులు రావాలి. ఏమైనప్పటికీ, పార్టీపద్ధతిలో నాకు నమ్మకం నశించింది కనుక దీనికి ప్రత్యా మ్నాయం ఏమైనా ఉంటుందేమోనని అన్వేషించసాగాను. పార్టీ లతో సంబంధం లేని నిర్మాణాత్మకమైన ప్రజల స్వపరిపాలన ఉండాలని గాంధీజీ అన్నారు. దీన్నే ఇంకా తరచి చూడడం ఆశా జనక మనిపించింది.

నా రాజకీయ సందేహాలు, సంశయాలు కేవలం పార్టీపద్ధతికే పరిమితమైనవి కావు కాబట్టి, మానవ సమాజంలో ప్రభుత్వం నిర్వహించవలసిన పాత్ర, ముఖ్యంగా సాంఘిక జీవనానికి నా దృష్టిలో కల లక్ష్యాల సాధనకు సంబంధించినంతవరకు, ప్రభుత్వ పాత్ర ఏమైఉండాలి?—ఇలాంటి ప్రధానమైన ప్రశ్నలుకూడా నాకు కలిగాయి. శాసనయుక్తమైన సమాజం లక్ష్యంగా కల మార్క్సువాద అధ్యయనం కారణంగా ఈ ప్రశ్నలు నన్ను ఇంకా ఎక్కువ బాధించసాగాయి. నా లక్ష్యాలను సాధించడంలో మార్క్సువాద మూలసిద్ధాంతాలు తోడ్పడజాలవని వాటిని వదిలిపెట్టినప్పటికీ మానవ స్వాతంత్ర్యం శాసనముక్త సమాజంలోనే సంపూర్ణంగా అనుభవంలోకి రాగలదని నమ్ముతున్నాను. ఏనాటికైనా రాజ్యాధికారం పూర్తిగా నశిస్తుందని నా కప్పటికీ ఇప్పటికీనమ్మకంలేదు. కాని రాజ్యాధికారం, దాని కార్యరంగం, బాధ్యతలు సాధ్యమైనంతవరకు తగ్గించ ప్రయత్నించడం, సాంఘిక జీవన లక్ష్యాల్లో అత్యుత్తమమైనదని మాత్రం నేను నిశ్చయంగా చెప్పగలను. అత్యల్పంగా పాలించే ప్రభుత్వమే అత్యుత్తమమైనదని గాంధీజీ చెప్పారు. అందులో నాకు నమ్మకం కుదిరింది. ఎలాంటి బాహ్యమైన ప్రతిబంధకాలు లేకుండా తోటివారితో స్నేహం, న్యాయం, సహకారం కలిగి మానవుడు జీవించకలగడమే మానవ పరిణామానికి గీటురాయని నా అభిప్రాయం. అందుకనే మానవుని సమస్య—సమాజ సమస్య— మౌలికంగా నైతికమైనదని విశ్వసించాను.

సమాజంలో రాజ్యాధికారం నిర్వహించవలసిన పాత్ర గురించిన్నీ, దానిస్థానం గురించిన్నీ నాకున్న ఈ భావాల మూలంగా

దినదిన ప్రవర్ధమానంగా విస్తృతిచెందుతున్న నేటి ప్రభుత్వాధికారం నాలో ఎంతటి భయాందోళనలు కలిగించిందో మీరు అర్థం చేసుకోగలరు. ప్రజాస్వామిక సోషలిస్టులు, కమ్యూనిస్టులు, సంక్షేమ రాజ్యవాదులు (ఫాసిస్టులగురించి చెప్పనే అక్కరలేదు) అందరూ రాజ్యాధికారవాదులే (Statists). వీరంతా తమతమ ఊహాలోకపు సుఖశాంతులను, మొదట రాజ్యాధికారాన్ని చేజిక్కించుకొని, దాన్ని ఇంకా విస్తృతిచేసినప్పుడే నెలకొల్ప వచ్చునని ఆశిస్తున్నారు.

బూర్జువా రాజ్యంలో రాజకీయాధికారమంతా ప్రభుత్వం లోనే ఉంటుంది. సోషలిస్టు రాజ్యంలో ప్రభుత్వానికి రాజకీయాధికారానికితోడు ఆర్థికాధికారంకూడా చేకూరుతుంది. అధికారమంతా ఇంత బ్రహ్మాండంగా కేంద్రీకృతమైనప్పుడు, దాన్ని అదుపులో ఉంచాలంటే కనీసం ఇంకా అంత అధికార ముండాలి. సోషలిస్టు సమాజంలో ఈ అదుపుచేసే అధికారం ఎవరికీ ఉండదు. కాగితాల మీద వ్రాసుకున్న రాజ్యాంగ చట్టాలతో వ్యక్తి స్వేచ్ఛ, సర్వ తంత్రత ఉంటాయనుకోవడం పొరబాటు. కేంద్రీకృతమైన ఆర్థిక, రాజకీయ యంత్రాంగం సర్వబల సంపన్నమై, ప్రజల స్వేచ్ఛలు, హక్కులు, చివరికి వారి ఆహారంకూడా, ప్రభుత్వ దయా దాక్షిణ్యాలపై ఆధారపడిపోతాయి.

ఇలాంటి ప్రమాదాలు ఏర్పడతాయని ప్రజాస్వామిక సోషలిస్టులకు తెలుసు. వీటి నిరోధంకోసం తగిన ఉపాయాలను వారు అన్వేషిస్తున్నమాటకూడా నిజం. స్వతంత్రమైన కార్మిక సంఘాలు ప్రజల స్వాతంత్ర్యానికి పెట్టని కోటలంటారు. కాని

కేంద్రీకృతమైన నిర్వహణపద్ధతి (bureaucracy) పెద్దపెద్ద కార్మిక సంఘాల్లోనే కరుడుగట్టుకొని పోయిందని అందరికీ తెలుసు. పారిశ్రామిక రంగంలో ప్రజాస్వామ్యాన్ని ప్రవేశపెట్టేందుకు, ప్రభుత్వ యాజమాన్యంక్రింద నడిచే పరిశ్రమల్లో ప్రజలకు ప్రభుత్వం జవాబుదారీ వహించేటందుకు తగిన మార్గాలనుకూడా వీరు అన్వేషించారు. వినియోగదార్ల సంఘాలు, అన్నిరకాల సహకార సంఘాలు, ప్రభుత్వంపై అదుపును నిర్బంధాలను పెడ్తాయి. అధికారం, కార్యనిర్వహణ పద్ధతి వికేంద్రీకృతం కావాలనికూడా ఇటీవల సోషలిస్టులు ఆలోచిస్తూనే ఉన్నారు. ఏమైనప్పటికి ప్రజాస్వామిక సోషలిస్టు వ్యవస్థ మహాపర్వతాకారంతో, ప్రజాస్వేచ్ఛను అణగద్రొక్కుతూ ఉంటుంది.

## ప్రజల సోషలిజం - ప్రభుత్వ సోషలిజం

ఈ పరిస్థితిని తప్పించాలంటే రాజకీయాలను వదిలి సర్వోదయం వైపు మళ్ళడం వినా మార్గాంతరం లేదని నాకు తోచింది. నేను పైన చెప్పినట్టు, ప్రజలు క్రమశిక్షణాబద్ధులై, సాధ్యమైనంత వరకు ప్రభుత్వం ప్రమేయంలేకుండా తమ పనులను తామే చేసుకొంటే ప్రభుత్వ పెత్తందారీతనం నశిస్తుంది. దీన్నే సోషలిస్టు పరిభాషలో ఇలా చెప్తాను : రాజ్యాధికారాన్ని ఉపయోగించి సోషలిజంను స్థాపించ యత్నించడంకంటే, ప్రజల స్వచ్ఛంద కృషిద్వారా, సోషలిస్టు జీవనపద్ధతులను సృష్టించి పెంపొందించాలి. మరొకవిధంగా చెప్పాలంటే ప్రజల సోషలిజమును నెలకొల్పాలి కాని ప్రభుత్వ సోషలిజం (State

Socialism)ను కాదు. సోషలిస్టులు సర్వోదయ సిద్ధాంతంతో ఏకీభవించకపోవచ్చు. కాని రాజ్యాధికారంతో లేక బలప్రయోగంతో నెలకొల్పిన సోషలిజముకంటే, ప్రజలు తమ స్వచ్ఛంద సమ్మతితో స్థాపించుకున్న సోషలిజం, నిజమైనదనీ, ఇతోధికంగా పరిపూర్ణమైనదనీ అంగీకరించాలి. ఇలాంటి ప్రజాసోషలిజము గురించి ఆలోచిస్తున్న సోషలిస్టుల సంఖ్య, దురదృష్ట వశాత్తు, అత్యల్పం. బ్రిటిష్ సహకారోద్యమ నాయకుడు, మిస్టర్ జాక్ బెయిలీ బ్రిటిష్ సోషలిస్టులగురించి ఇలా అన్నాడు: "రాజ్యాధికారాన్ని వశపర్చుకొని దాన్ని ఉపయోగించాలనే చాలామంది బ్రిటిష్ సోషలిస్టులు భావిస్తున్నందున, ప్రభుత్వ సంబంధంలేని సోషలిస్టు స్వరూపాలు ఉండాలన్నసత్యాన్ని, వారు చూడలేకపోతున్నారు." ప్రపంచంలో ఇతరదేశాల సోషలిస్టుల స్థితికూడా ఇలాగే ఉంది. ప్రభుత్వంతో సంబంధంలేని సోషలిస్టు స్వరూపాలను పెంపొందించేటందుకు, ఒక పార్టీద్వారా పనిచేయడం కాని, అధికార వశీకరణకై ఘర్షణ పడడం కాని అవసరంలేదని వేరే చెప్పనక్కరలేదు. పార్టీలకు, అధికారానికీ ఈ విషయంతో అసలు సంబంధమేలేదు. కావలసింది ఏమిటంటే స్వార్థరహితులైన కొందరు కార్యకర్తల బృందం మాత్రమే. వీరు ప్రజలమధ్య జీవిస్తూ, ప్రజల్లో సంచరిస్తూ వారి జీవనాన్ని స్వశక్తి, స్వపరిపాలన ఆధారంగా పునర్నిర్మించాలి. ఈ సందర్భంలో గాంధీజీ ప్రతిపాదించిన లోక్‌సేవక సంఘ ప్రణాళికను విస్మరించలేము.

ప్రజలు తమ వ్యవహారాలను ప్రత్యక్షంగా తామే నిర్వహించుకోగలిగి, సోషలిస్టు సమాజ రూపకల్పన చేసే విలువలను

పరిరక్షించుకోగల సాంఘిక వ్యవస్థ స్వరూపం ఎలా ఉంటుందన్న ప్రశ్న ఇక్కడ ఉదయిస్తున్నది. సహకారం, ఆత్మసంయమం, బాధ్యతాజ్ఞానం ఇవన్నీ ఇలాంటి కొత్త సమాజంలో ఉండాలి. ఈ ప్రశ్న పట్ల సోషలిస్టులు ఇప్పటివరకు చాలాతక్కువ శ్రద్ధ వహించారు. ఈనాటి మానవ సమాజం బహుముఖంగా వ్యాపించి సంక్లిష్టమైన పారిశ్రామిక నాగరికత ఒకటి ఏర్పడింది. ఈ వ్యవస్థలో మనం నగరాలనుకునే మానవ కాననములు ఏర్పడ్డాయి. వీటిలోని సాంఘికార్థిక సంబంధాలు ఏమాత్రం వ్యక్తిగతమైనవికావు. జీవన ప్రదం కావు. ఇక్కడ పనిపాటలు చేసుకునే పద్ధతులు, ఆనంద విహీనమై, సృజనాత్మక కార్యకలాపాలకు అవకాశాలు ఇవ్వక మనలను బాధిస్తాయి. ఉత్పత్తి, సామర్థ్యం—ఈ రెంటికే ఇక్కడ చలామణి. విజ్ఞానశాస్త్రం కారణంగా ప్రపంచమంతా కుంచించుకు పోయి సాన్నిహిత్యం ఏర్పడింది. కాని మానవుడు నిర్మించుకున్న నాగరికత వల్ల పొరుగువారుకూడా అపరిచితులై పోయారు. బూరోక్రాట్లకు, మేనేజర్లకు, సాంకేతిక నిపుణులకు, రాజ్యాధికార వాదులకు ఇలాంటి సంక్లిష్ట, విస్తృత సమాజం స్వైర విహారం చేసే మైదానం. ఈ సమాజంలో సోదరులుకూడా సోదరులుగా జీవించలేరు. సైన్సు, ఉత్పత్తి, సామర్థ్యం, జీవన ప్రమాణంలాంటి ఆశాజనకమైన ఆదర్శాలపేరిట, ఈ భ్రాతృహత్యామయ సమాజ వ్యవస్థను సోషలిస్టులు యథాతథంగా స్వీకరించారు. ప్రభుత్వ యాజమాన్యాన్ని ప్రవేశపెట్టి ఇదే సోషలిజం అన్నారు. కాని ఇలాంటి వ్యవస్థలో సోషలిస్టు గాలికూడా పీల్చడానికి లభించదని నా అభిప్రాయం. చిన్నచిన్న గణాలలో జీవిస్తే స్వరాజ్యం, స్వపరి

పాలన, పరస్పర సహకారం, సంపద భాగస్వామ్యం, సమత, స్వేచ్ఛా సౌభ్రాతృత్వాలను ప్రజలు హెచ్చుగా ఆచరించి, పెంపొందించ గలుగుతారు. పాశ్చాత్య దేశాల్లోకూడా మానవ పురోగతిని కోరే ఆలోచనాపరులు ఈ సత్యాన్ని గుర్తించ నారంభించారు.

ప్రకృతి, సంస్కృతి—ఈ రెండు కలిసి మానవుణ్ణి సృష్టించాయి కాబట్టి ఈ రెండు పరస్పర వైరుధ్యం లేకుండా సమ్మిళితం కావడం మానవుని సర్వతోముఖాభివృద్ధికి అవసరం. నవీన మానవ నాగరికతా కేంద్రాలైన లండన్, పారిస్, న్యూయార్క్, మాస్కోలలో ఎన్నో ఉద్యానవనాలు, పచ్చనిబయళ్ళు ఉన్నప్పటికీ, ఇలాంటి సమ్మేళనం సాధ్యంకాదు. అందుకే మానవుని అభ్యుదయం అరికట్టబడి, ఏకముఖంగానే జరుగుతుంది. చిన్న చిన్న ప్రజావాసాల్లోనే ప్రకృతీ సంస్కృతులు మేళవం సుసాధ్యమవుతుంది.

ఆల్డస్ హక్స్లీ తన గ్రంథమైన "Science, Liberty and Peace" లో ఇలా అన్నారు. "మానవునికి కొంతవ్యక్తిగత స్వేచ్ఛ, బాధ్యత ఆంతరంగికంగానేకాక స్వరాజ్యం కల సమాజంపట్ల కూడా ఉండాలి. అతని పనులు సుందరములై మానవత్వానికి ప్రధానములై ఉండాలి. తరువాత తనచుట్టూ ఉన్న నైసర్గిక వాతావరణంతో అతనికి సహజమూ, మౌలికము అయిన సంబంధం ఉండాలి. లేకపోతే అతని ఆధ్యాత్మిక అవసరాలు తీరవు సరికదా, అతని మానసికావసరాలుకూడా పూర్తికావు."

ఈ కారణాలవల్లనే గాంధీజీ తన ఊహాచిత్రంలోని సమాజానికి గ్రామరాజ్యం పునాది కావాలన్నారు. అంటే అందరూ

సమానులై స్వతంత్రులై, సోదరులవలె ప్రశాంతంగా జీవించ గలిగే సమాజం అన్నమాట.

చిన్న బస్తీల్లో నివసిస్తూ, చిన్న యంత్రాలద్వారా స్థానిక వినియోగంకోసమే వస్తూత్పత్తి చేసుకుంటూ ఉండడం, సైన్సు ద్వారా సాధించిన విజయాలన్నింటినీ వదులుకోవడమే అవుతుందని కొందరు అనవచ్చును. సైన్సును ఉపయోగించడమంటే, భారీఎత్తున కేంద్రీకృతమైన ఉత్పత్తి పద్ధతులు అవలంబించడం, అసంఖ్యాక జనావళి కలగాపులగంగ పెద్ద నగరాల్లో నివసించడమని వీరి భావన. ఇది అర్థంలేని వాదం. సైన్సులో రెండు భాగాలు. ఒకటి కేవలం విజ్ఞానం (Pure Science) రెండవది ఆ విజ్ఞానాన్ని ఉపయోగించడం (Applied Science). ఇందులో మొదటిదే సైన్సు. రెండవది సాంకేతిక పరిజ్ఞానంమాత్రమే. సమాజం స్వభావంబట్టి సైన్సు ఉపయోగం జరుగుతుంది. భారీ యంత్రాలతో చేసే ఉత్పత్తి ధనార్జన చేసేవారికి లాభదాయకంగా ఉండడంవలన సాంకేతిక పరిజ్ఞానాభివద్ధికూడా ఆ ఉద్దేశంకోసమే జరిగింది. సమాజంలో ధనార్జన చేసేవారికి పెత్తనం ఉండేదికాబట్టి వారి అభీష్టం నెరవేర్చవలసి వచ్చింది. ప్రభుత్వాలుకూడా వాటి ఆశయాలు ఏమైనప్పటికీ, కేంద్రీకృతమైన భారీ ఉత్పత్తి పద్ధతులకే ప్రాధాన్యత ఇచ్చాయి. యుద్ధం చేయడానికి ఇవి ఎంతో తోడ్పడుతాయి. పైగా మహత్తరమైన రాజకీయార్థిక అధికారాలను తమ గుప్పిట్లో పెట్టుకోవాలనే ప్రభుత్వాల ఉద్దేశం కదా. ఈ విధంగా నేటి మానవ సమాజాన్ని భ్రాతృహత్యా కాండగా మార్చడానికి ప్రభుత్వాలు లాభార్జనాపరశక్తులు చేతులు కలిపాయి.

దీనిలో సైన్సు జోక్యం ఏమీలేదు. నిజానికి విజ్ఞాన శాస్త్రవేత్తలకు స్వేచ్ఛ ఉంటే తమ శ్రమఫలితంగా తయారైన ఉత్పత్తి, వినాశన సాధనములను, ఎప్పుడో నాశనంచేసి ఆనందానుభూతిని పొందే వారు. కాని లాభాలు, అధికారాలు, యుద్ధాలుకాక, శాంతి, సహ కార సౌజన్యాలను సమాజం ఉద్దేశించిఉంటే అందుకు దోహదం చేసే సాంకేతిక పరిజ్ఞానసృష్టికి సైన్సు తప్పకుండా తోడ్పడేది. అలా జరిగితే అది తిరోగమనాన్ని కాక, వినాశనాత్మక పంథాను వదలి సృజనాత్మకదిశను సైన్సు చేస్తున్న పురోగమ నాన్నే సూచిస్తుంది. ఉత్పత్తి సాధనములను వికేంద్రీకరించే టందుకు, చిన్న యంత్రాల సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించే టందుకు అణుశక్తి అవకాశాన్ని కల్పించదని మన మిక్కడ గమనించాలి.

హక్స్లీ ఇంకాఏమన్నాడో చూడండి: "పెద్దపెట్టునఉత్పత్తి చేసి, పంపిణీచేసే ప్రస్తుత మన పారిశ్రామికశక్తికి ఇంకా విస్తృతినీ హెచ్చు ప్రావీణ్యతను కలిగించేటందుకు, విజ్ఞానశాస్త్ర పరిశోధన ఫలితాలను ఉపయోగిస్తే, అధికారం ఇంకా తక్కువ మంది హస్తాల్లో కేంద్రీకృతమైపోతుంది. ఈ విధంగా రాజకీయ, ఆర్థిక అధికారాలు కేంద్రీకృతమైపోయినప్పుడు, ప్రజలపౌరస్వాతంత్ర్యాలు క్రమంగా క్షీణిస్తాయి. వారి వ్యక్తిగతసేచ్ఛ పోతుంది. స్వపరిపాలన చేసుకునే అవకాశాలు నశిస్తాయి. అధికార కేంద్రీకరణకు ఇది సహజమైన పరిణామం. అయితే ఇక్కడ మన మొక విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలి: నిర్లిప్తంగాచేసే వైజ్ఞానికశాస్త్ర పరిశోధ నలను కేంద్రీకృతమైన ఆర్థిక, పారిశ్రామిక వ్యవస్థలకోసం,

ప్రభుత్వంకోసం మాత్రమే ఉపయోగించి తీరాలని ఏమీలేదు. శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులు తలచుకొంటే, ఆర్థికస్వయం సమృద్ధిని పెంపొందించేటందుకు, తమ శాస్త్రజ్ఞాన ఫలితాలను అన్వయించగలరు. ఇందువల్ల వ్యక్తిగతంగా కాని సహకార పద్ధతిని కాని పనిచేసే చిన్నచిన్న యజమానుల రాజకీయ స్వాతంత్ర్య పరిరక్షణకు, భారీఎత్తున జరిగే వాణిజ్యానికి కాక తమ జీవనంకోసం స్థానిక విక్రయశాలలకు చేసే సరఫరాలకు తోడ్పడ గలుగుతారు."

ఈ నవ సమాజ స్వరూపం ఎవరికైనా సుస్పష్టంగా అవగాహన అయిందని కాని, దానికి సంబంధించిన సమస్య లన్నింటికి పరిష్కారాలు లభించాయని కాని నేను చెప్పడంలేదు. ఉదాహరణకు ఈ చిన్నచిన్న స్వయంసమృద్ధ, స్వయంపోషక స్వయంపాలిత గ్రామరాజ్యాలమధ్య పరస్పర సంబంధం ఎలా ఉండాలనే ప్రశ్న మనకు తక్షణం కలుగుతుంది.

"అసంఖ్యాక గ్రామాలతో అలరారుతూ ఉన్న ఈ వ్యవస్థ అనునిత్యం విస్తృతమవుతున్న వృత్తములవలె ఉంటుంది. ఇందులో ఒక వృత్తం మరొక వృత్తంపై ఆరోహించడమంటూ ఉండదు. పిరమిడ్ శిఖరాగ్రం దాని అడుగుభాగంపై ఆధారపడి ఉంటుంది, నేను కోరుతున్న వ్యవస్థలో జీవనం ఇలా ఉండదు. అది సముద్రజలవృత్తంవలె ఉంటుంది. వ్యక్తి దాని కేంద్రం. ఈ వ్యక్తి గ్రామంకోసం ఆత్మార్పణ చేయడానికి సదా సంసిద్ధుడై ఉంటాడు. ఈ గ్రామం, గ్రామాల వృత్తంకోసం బలికావడానికి సంకోచించదు. ఈ విధంగా, అహంకారమూ, దురాక్రమణబుద్ధి

లేకుండా, వినమ్రులైన వ్యక్తులుకల జీవనం ఏర్పడుతుంది. ఇందులో అందరూ తమతో సంలీనమై ఉన్న సముద్రజలవృత్తపు వైభవాన్ని పంచుకుంటారు" అని గాంధీజీ తమ ఊహాచిత్రాన్ని అద్భుతంగా లిఖించారు.

గాంధీజీ మాటలు మనకు దిగ్దర్శకములు మాత్రమే. ఈ ఊహాచిత్రం విస్పష్టరూపం దాల్చడానికి ఇంకా ఎంతో ఆలోచన, అనుభవం కావాలి. అయినా గమనార్హమైన విషయమొకటి ఉంది. వ్యక్తిగత సంబంధాలకు అవకాశం కల చిన్నచిన్న ఆవాసాల్లో ప్రజలు నివసిస్తే సర్వోదయ ఆదర్శాల ఆచరణకు అవకాశాలు హెచ్చుగా ఉన్నప్పటికీ, ప్రజావాసాలు చిన్నగా ఉన్నంతమాత్రాననే అక్కడ సర్వోదయ వ్యవస్థ ఉంటుందని భావించలేము. లేకపోతే భారతదేశంలో ప్రతిగ్రామంలో మనకు సర్వోదయం ప్రత్యక్షమయేది. ఆంతరంగిక గుణాలు ఉన్నప్పుడే బాహ్య స్వరూపాలు గణనీయములవుతాయి. ఎలాంటి వాతావరణంలోను, సాంఘిక వ్యవస్థలోను, సర్వోదయ జీవన పద్ధతి మనగలుగుతుంది అని పరిశోధించ పూనుకునేముందు అసలు సర్వోదయ ఆదర్శాలను అవగాహన చేసుకొని, అంగీకరించాలి.

స్వయం పోషకమై స్వపరిపాలన కల గ్రామాలు పరస్పరానుబంధం కలిగి ఉంటాయా ? జాతి, ఐక్యత, దేశభద్రతలు ఎలా సంరక్షింపబడ్తాయి అని కొందరు భయాన్ని వెలిబుచ్చారు. సర్వోదయ ప్రపంచంలో ఇప్పటివలె వేర్వేరు జాతీయరాజ్యాలు ఉండవు. సర్వోదయ దృక్పథం విశ్వజనీనమైనది. గాంధీజీచెప్పిన సముద్రజల వృత్తం కేంద్రంలో ఉండే వ్యక్తి, ప్రపంచ పౌరుడు.

ప్రస్తుతానికి సర్వోదయపు ప్రపంచదృష్టి నలాఉంచుదాము. స్వపరిపాలన కల గ్రామాలు పరస్పర శత్రుత్వం కలిగి అన్యోన్యత లోపించి స్వార్థపూరితంగా ఉంటాయని ఎందుకు భావించాలి? ప్రజల ఆంతరంగిక జీవనం ఉత్తమ పునాదుల ఆధారంగా ఉంటే, వారి బాహ్య జీవనంకూడా ఉత్తమంగానే ఉంటుంది.

## లోకసేవక సంఘంగా సహజ పరిణామము

గాంధీజీ సజీవంగా ఉన్నప్పుడు క్రమక్రమంగా నే నాయనకు సన్నిహిత మవుతూ వచ్చినప్పటికీ, ఆయన అహింసాయుత కార్యాచరణ పద్ధతితో ఏవిధంగా సాంఘిక విప్లవం సాధించగలమో నేను తెలుసుకో లేకపోయాను. జాతీయ విప్లవ సాధనంగా ఆ పద్ధతి ఎలా పనిచేసిందో నేను చూశాను. కాని భూస్వామ్య విధానాన్ని, పెట్టుబడిదారీతనాన్ని ఈ అహింసాయుధంతోనే తుద ముట్టించి నవసమాజాన్ని ఎలా నిర్మించగలమో నాకు బోధపడ లేదు. హృదయ పరివర్తన ద్వారా విప్లవాన్ని సాధించడం గూర్చి గాంధీజీ చేసిన రచనలను నేను చదివాను. కాని ప్రత్యక్షమైన నిదర్శనం లేకుండా యిది ఆచరణ సాధ్యమని నమ్మడం దుస్తరంగా కనపడింది. నేను మార్క్సువాదిగా వున్న రోజులలో ధర్మకర్తృత్వ సిద్ధాంతంపై తీవ్రమైన విమర్శ వ్రాశాను. గాంధీజీ జీవితాంతంనాటికి మార్క్సు వాదాన్ని వదలి నేను చాలా దూరం వెళ్ళినప్పటికీ, ధర్మకర్తృత్వాన్ని వ్యక్తిపరంగాకాక, సమాజపరంగా అన్వయించ వచ్చునని విశ్వసించలేకపోయాను. స్వాతంత్ర్య సముపార్జనానంతరం మహిమాన్వితమైన గాంధీజీ జీవిత యాత్రలో

ద్వితీయ ఘట్టం ప్రారంభమవుతుంది. ఈ ఘట్టంలో మరొక జాతీయ కార్యక్రమాన్ని ఆరంభించాలని ఆయన తలపోస్తున్నారని నే నిది వరకేచెప్పాను. ఈకార్యక్రమ స్వరూపాన్ని ఆయన తనమనస్సులో అప్పటికి తీర్చి దిద్దుతున్నారు. స్వాతంత్ర్య సమరంలో అహింసా యుత సేనా వాహినిగా తాను నిర్మించిన కాంగ్రెసును లోక్ సేవక సంఘంగా మార్చాలని చేసిన పరమాద్భుత ప్రతిపాదన ఆయన ప్రజ్ఞాకౌశలాన్ని సూచిస్తున్నది. నేను పైనచెప్పినట్లు దీని ప్రాధాన్య తను గుర్తించలేకపోయాను. ప్రజాస్వామిక పరిస్థితుల్లో హింసా విధానం విప్లవ నిరోధక చర్య అని దాన్ని విడనాడిన తరువాత, ఇక సాంఘిక విప్లవ సాధనకు, సంప్రదాయ సిద్ధంగా వస్తున్న సోషలిస్టు పద్ధతులే నాకు మిగిలాయి. కాని ఆ పద్ధతిలో ఉన్న ఘోరమైన లోపాలు, వాటితో సాధించకలిగిన అత్యల్పమైన ఫలితాల కారణంగా నాలో ఆలోచన రేకెత్తింది.

## వినోబా ఉద్యమ జననం

నే నీదశలో ఉన్నప్పుడు మహత్తర ప్రాముఖ్యత కల సంఘటన ఒకటి సంభవించింది. తెలంగాణాలో మూలనున్న ఒక గ్రామంలో భూదానోద్యమం ప్రావిర్భవించింది. సాధారణంగా అందరికి కలిగిన అభిప్రాయమే మొదట నాకు కూడా దీనిగూర్చి కలిగింది. ఈ విధంగా దేశంలోని భూమి నంతా పునర్విభజన చేయాలంటే కొన్ని వందల సంవత్సరాలు పడుతుందనుకున్నాను. కాని నా అభిప్రాయాన్ని మార్చుకొని తీవ్రంగా ఆలోచించడానికి రెండు కారణాలు కనబడ్డాయి. మొదటి కారణం భూదానోద్యమ

కర్త వినోబా. ఆయన నాకు చాలా సంవత్సరాలనుంచి తెలుసు. వర్ధా వెళ్ళినప్పుడల్లా వినోబాను చూసేటందుకు ప్రత్యేకంగా వెళ్ళే వాడిని. సంభాషణల్లో ఆయన ప్రకటించే భావాలు ఎప్పటికప్పుడు క్రొత్త ఆలోచనలను రేకెత్తించి నూతన దృక్పథాలను సూచిస్తూ ఉంటాయి. నేను చదివిన కొన్ని వినోబా రచనల నవ్యత్వం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. 1941 లో మొదటి సత్యాగ్రహిగా వినోబాను గాంధీజీ నిర్ణయించిన సంఘటన నాకు జ్ఞాపక మొచ్చింది. గాంధీజీ నిర్యాణానంతరం, గాంధీవాదానికి చెందిన నిర్మాణ కార్యకర్తల, రాజకీయ కార్యకర్తల ప్రథమ సమావేశం వర్ధాలో జరిగింది. ఆ సమావేశంలో వినోబా విస్పష్టమైన మార్గదర్శకత్వం వహించిన వైనం కూడా నేను చూశాను. వినోబాలాంటి వ్యక్తి ఏ ఉద్యమాన్ని అయినా ప్రారంభిస్తే దాన్ని కేవలం ఒక నిరర్థక ఎత్తుగడగా కొట్టి వేయడానికి వీలులేదని నాకు తోచింది. ఆ ఉద్యమం క్రమక్రమంగా పురోగమించడం రెండవ కారణం. చిత్తశుద్ధి, పట్టుదల గల కార్యకర్తలు పూనుకున్న ప్రతి సందర్భంలోను ఈ ఉద్యమం సాధించిన ఫలితాలు స్పష్టంగా కనపడ్డాయి. ఉద్యమ నిర్మాణ పద్ధతికూడా ఆచరణీయంగానే కనపడింది. సాధారణ రాజకీయ కార్యక్రమాల కోసం చేసే యత్నాన్నే, భూదానోద్యమం కోసం చేస్తే, ఇంకా ఉత్తమ ఫలితాలు వేగంగా లభిస్తా యనిపించింది.

ఈ దశలో పూర్వపు సోషలిస్టుపార్టీ భూమి పునర్విభజన సమస్యపై తన దృష్టిని కేంద్రీకరించింది. భారతదేశ ఆర్థిక సమస్యల్లో భూసంస్కరణ సమస్య అతి ప్రధానమైనది, వెంటనే పరిష్కరించవలసినది అని పార్టీ నిశ్చయించింది. పచ్మడిలో

జరిగిన పార్టీ మహాసభలో నేనొక తీర్మానాన్ని ఈ సమస్యపై ప్రతిపాదించాను. అందులో భూదానోద్యమం గూర్చి క్లుప్తంగా ఉదహరించి, హర్షం ప్రకటించాము. కొంతకాలం తరువాత, వినోబా ఉత్తరప్రదేశ్‌లోని బందా జిల్లాలో పర్యటిస్తున్నప్పుడు, ఈ భూ పునర్వితరణ సమస్యగూర్చి చర్చించేటందుకు ఆయన్ను కలుసుకున్నాను. ఈ సమస్యకు వినోబా చాలా ప్రాముఖ్యత యిస్తున్నారని, ఆయన ఆర్థిక దృక్పథం, ప్రధానంగా విప్లవకర మైనదనీ, ఆ చర్చవల్ల నాకు బోధపడింది. వినోబా ప్రారంభించిన ఉద్యమంలో చేరిపోవాలని నేను నిశ్చయించుకున్నాను. కాని నేను మూడువారాలు నిరాహారదీక్ష వహించవలసి ఉండెను. అది పూర్తి కాగానే, బీహార్ రాష్ట్రంలోని గయా జిల్లాలో భూదాన గంగలోకి దూకాను. అప్పటి అనుభవం నాలో ఊహాతీతమైన ఉత్సాహాన్ని సృష్టించింది. ఒక్క వారం రోజులలో, నేను పాల్గొన్న సభల్లో ఏడువేల ఎకరాల భూదానం లభించింది. ఇచ్చిన వారిలో అధిక సంఖ్యాకులు చిన్న భూ ఖామందులే. వారు ఉత్సాహ సంభ్రమాలతో స్వేచ్ఛగా యిచ్చారు.

ఉద్యమం పురోగమిస్తూ నూతన రూపాలు దాల్చింది. దీని ప్రభావం అనన్యమైనదని 1952 నాటి ఒక సంఘటన అదివరకే నిరూపించింది. ఉత్తర ప్రదేశ్‌లోని హమీర్‌పూర్ జిల్లా లోని మంగ్రోట్ గ్రామం గ్రామ సర్వస్వం దానంగా లభించింది. నూతన పదాలను సృష్టించడంలోను, పాతపదాలకు క్రొత్త అర్థాలను ఇవ్వడంలోను వినోబా ప్రతిభ అద్భుతమైనది. దాన మంటే ఇవ్వడంకాదు, ఇతర్లతో కలిసి భాగం పంచుకోవడమని

ఆయన అర్థం చెప్పారు. "దానం సమ్‌విభాగః" అని శంకరుడు చేసిన నిర్వచనాన్ని వినోబా పైవిధంగా వివరించారు. గ్రామం లోని భూమినంతా గ్రామప్రజలు సమంగా పంచుకొనడమే గ్రామదానం. భూమిహీనులకు భూమి యివ్వడం భూదానం. కాని గ్రామదాన మంటే, భూమిని సంఘపరం చేయడము. భూమికి వ్యక్తి కాక సంఘం సమిష్టిగా యాజమాన్యం వహించడ మన్నమాట. సమగ్రమైన భూక్రాంతి బీజాలు భూదానంలో ఉన్నాయని స్పష్టపడింది.

ఎంత సుందరమైన క్రాంతి ఇది! మనకు తెలిసిన ఇతర విప్లవాలకూ దీనికీ పోలికే లేదు. జమీందారీ పద్ధతి రైతు యాజ మాన్యంతోసహా, వ్యక్తిగత స్వామ్యాన్ని ఇతర దేశాల్లో శాసన బలంతోనో, దౌర్జన్యంతోనో నిర్మూలించారు. ఈ "విప్లవాల" వల్ల కలిగిన సాంఘిక ఫలితాలు దుఃఖకరంగానే ఉంటూ వచ్చాయి, కోపం, ద్వేషం, బాధ, మాత్రమే కాక దమన నీతి అవలంబన, స్వతంత్రులైన రైతులు బానిసలై పోవడం, వ్యక్తిగత బాధ్యతల్లేని వ్యవసాయపు పెత్తందార్లు అవతరించడం మొదలైనవి జరిగాయి. అధికారమంతా కేంద్రీకృతమై నియంతృత్వా లేర్పడ్డాయి. గ్రామ దానం రూపంలో సాధించిన విప్లవంలో వ్యష్టిస్వామ్యాన్ని తొల గించడంలో ఎలాంటి బలప్రయోగం జరగలేదు. వ్యక్తులే తమ స్వామ్యాధికారాన్ని స్వచ్ఛందంగా సంఘపరం చేశారు. బాహ్యంగా వచ్చిన సాంఘిక మార్పుకు, ఆంతరంగికమైన మానవ హృదయ పరివర్తన తోడైంది. గాంధీజీ చెప్పిన విప్లవద్వయం అంటే ఏమిటో ఈ ఉద్యమం చూపించింది. సమాజంలో ఉన్న ఉద్రిక్త

తలు, సంఘర్షణలు, దౌర్జన్యాలు పోయి, స్వేచ్ఛ, పరస్పర స్నేహం, సత్సంబంధాలు ఏర్పడ్డాయి. దీనితో స్వేచ్ఛా సమన్వితమైన సమిష్టి కృషి అపూర్వంగా పొంగి పొరలింది. (మంగ్రోట్‌లో నాలుగు సంవత్సరాల కాలంలో ఉత్పత్తి మూడింతలు హెచ్చిన యధార్థం యిక్కడ గమనించ దగినది.)

మంగ్రోట్ గ్రామదానం లభించిన కొంతకాలం తరువాత అక్కడ వచ్చిన మార్పులను స్వయంగా తెలుసుకునే నిమిత్తం అక్కడికి వెళ్ళాను. నాకక్కడ దేశ భవిష్యత్తు ఎలా ఉండగలదో గోచరించింది. మంగ్రోట్‌లో వచ్చిన పరివర్తన ప్రతి గ్రామం లోను వస్తే ఎలాంటి నైతిక, ఆర్థిక, రాజకీయ సాంఘిక మహా విప్లవం దేశాన్ని ముంచెత్తుతుందో ఊహించినప్పుడు ఉత్సాహ సంభ్రమాలతో హృదయం నిండిపోతుంది. మంగ్రోట్‌లో వచ్చిన పరివర్తన భారతదేశములోని యితర గ్రామాల్లో ఎందుకు రాకూడదో నాకు తెలియదు. మంగ్రోట్ ప్రజలు దేవతలు కారుకదా !

కొంతకాలం తరువాత సంపత్తి దానాన్నికూడా వినోబా తన కార్యక్రమంలో చేర్చారు. పైపైకి చూస్తే ఇది విరాళాలు వసూలు చేయడానికి మరొక ఎత్తు అనిపిస్తుంది. నిజానికి ఇది ఒక భూస్వామ్యాన్నే కాక, అన్నిరకాల ఆస్తి యాజమాన్యాన్ని, గాంధీజీ ప్రతిపాదించిన ధర్మకర్తృత్వంలోకి మార్చడానికి చేసే కృషి ఆరంభం మాత్రమే. ఈ కొత్త విప్లవపంథాను కేవలం భూమి సమస్యకే కాక అన్ని రకాల సంపదలకు వర్తింపచేయ వచ్చునని సంపత్తి దానోద్యమం చూపించింది.

సాంఘిక విప్లవ సాధనకు గాంధీతత్వం ఆచరణ సాధ్యమైన మార్గాన్ని చూపుతుందా అని ఎంతోకాలంనుంచి నన్ను ఎదుర్కొంటున్న ప్రశ్నకు వినోబా ఉద్యమంతో నాకు సమాధానం లభించింది. గాంధీజీ ప్రారంభించిన కార్యాన్ని, అవలంబించిన పద్ధతులను యింకా ముందుకు తీసుకొనిపోయి, వినోబా అద్భుతమైన విధంగా మనకు యీ విషయంలో మార్గ దర్శకత్వం వహించారు.

## పరివర్తనానికి పెద్దపెట్టున సాగే ప్రయత్నం

ఇది ద్విముఖమైన ఉద్యమం. ఒకవైపున పెద్దపెట్టున ఉద్యమం సాగించి, గాంధీజీ చెప్పిన విధంగా ప్రజల్లో పరివర్తన తీసుకురావాలి. అంటే బ్రహ్మాండమైన ప్రబోధ ప్రచారాలతో, లోప భూయిష్టమని తేలిన ప్రస్తుత అభిప్రాయాలను, జీవిత విలువలను త్యజించమని ప్రజలకు నచ్చచెప్పి ఒప్పించాలి. నవభావ ప్రేరితులను చేయాలి. ఈ విధంగా భావాల్లో విప్లవం అంకురిస్తుంది. నూతన భావాలను, విలువలను అంగీకరించి ఆచరిస్తే, ప్రధానమైన సాంఘిక సమస్యలు పరిష్కరింపబడ్తాయనీ, దానితో సంఘంలోనే ప్రధానమైన మార్పులు వస్తాయనీ ప్రజలు గుర్తించగలుగుతారు. ముందు సామాజిక వ్యవస్థలో ఉండవలసిన విలువలను ఇప్పుడు ఈ క్షణం వ్యక్తులు ఆచరించ ప్రారంభించినప్పుడే, ఈ పరివర్తన వస్తుందని గమనించడం అవసరం.

విప్లవ సముపార్జనకై ఉపయోగించిన సాధన మార్గాలు ఆ విప్లవోద్దేశానికి అనుగుణంగా లేకపోతే అది వైఫల్యం చెందు

తుంది. ప్రపంచంలోని ఇతర విప్లవాలు విఫలంకావడానికి కారణం ఇదే. ఉదాహరణకు చెప్పాలంటే, శాసనముక్తమైన సమాజ స్థాపన ఉద్దేశమైతే శాసనాధికారంద్వారా బలవంతంచేసి ఆ ఉద్దేశ సాధనకు పూనుకుంటారు. సౌభ్రాతృత్వ స్థాపన ఆశయమైతే, వర్గ సంఘర్షణ పేరిట భ్రాతృహత్య కాండను కొనసాగిస్తారు. సమాజంలో అన్ని కార్యాలకు ప్రేరణ ఇస్తున్న స్వార్థపరతను తొలగించేటందుకు, సమాజంలోని కొన్ని వర్గాల స్వార్థాన్ని ఊతగా తీసుకొని పనిచేస్తారు. సర్వోదయ పద్ధతి విప్లవంలో ఆశయం దాని సాధన మార్గాలు ఒకటే. సమాజ నవ్యవ్యవస్థలో ఆస్తి అంతా సమాజపరమై, యజమాని కేవలం ధర్మకర్తగా ఉండవలసి ఉంటే, వ్యక్తులు ధర్మకర్తలుగా ఉండడం ఇప్పుడే ఆరంభించాలి.

ఈ కొత్తభావాలను విలువలను ఆచరించడం కష్టం కాబట్టి, సాధారణ ప్రజలుకూడా సులభంగా, క్రమక్రమంగా పాల్గొని లక్ష్యాన్ని చేరుకునే విధంగా, ఉద్యమంలో వివిధ దశలు నిర్ణయించారు.

ఒక ఉదాహరణ ఇస్తాను: మనం మన ఆస్తులకు ధర్మకర్తలం మాత్రమే కాబట్టి, సమాజం మనకిచ్చిన భాగానికి మించి మనం అనుభవించ కూడదు అని వినోబా తమ ఉద్యమం ద్వారా ప్రబోధిస్తున్నారు. అంటే ధర్మకర్తలుగా జీవించి, మనకున్న ఆస్తిని యితర్లతో పంచుకోమని చెబుతున్నారు. ఈ రోజుల్లో ఇలాంటి మార్గం త్రొక్కడం చాలా కష్టం. అందుకని ముందు తన ఆస్తిలో కొంత భాగాన్ని మాత్రమే ఇతర్లకు యివ్వమని వినోబా అంటున్నారు. ఈ మాత్రంకూడా ఒక వ్యక్తి ఏకైకంగా

చేయాలంటే కష్టమే. చుట్టూ అవినీతి ఉంటే నీతివంతంగా జీవించడం చాలా కష్టం. అందుకోసం ఎంతో కృషి, నైతికశక్తి కావాలి. కాని చుట్టూ అందరూ అలాంటి ప్రయత్నం చేస్తున్నప్పుడు, అతి బలహీనులు కూడా ధైర్యం వహించి ముందుకు అడుగు వేయగలుగుతారు. కాబట్టి ఈ భావ పరివర్తన వ్యక్తిలో తీసుకురావాలని యత్నించినప్పటికి జనసామాన్యమందరికీ పరివర్తింప చేయడమే దీని ఉద్దేశం. జనావళి అంతటినీ ఈ ఉద్యమం స్పందించి కదిలిస్తుంది.

## స్వయంకృతి - స్వయంపాలన

గ్రామాల్లో నివసించే ప్రజలలో తమ వ్యవహారాలను తామే నిర్వహించుకొని నూతన భావాలు, విలువల ఆధారంగా పరస్పరం సహకారం చేసుకొని కొత్తసంస్థలను నూతన సాంఘిక జీవన విధానాన్ని సృష్టించుకొన కలిగేటందుకు ఒక కార్య ప్రణాళికను ఇచ్చి అమలు జరపడం ఈ ఉద్యమ రెండవ కార్యక్రమం. ఉదాహరణకు భూసేకరణోద్యమముతోపాటు స్వంత వినియోగంకోసం, స్థానికవినియోగంకోసం, వస్తూత్పత్తి కార్యక్రమంకూడా ఉంటుంది. నూతనవ్యవసాయార్థిక వ్యవస్థను సృష్టించే గ్రామదాన కార్యక్రమం ఉంటుంది. గ్రామ స్వరాజ్య కార్యక్రమం ఉంటుంది. ఈ విధంగా భూదానం, సంపత్తిదానం, గ్రామదానం ద్వారా భావాల్లో విప్లవ ప్రయత్నం జరుగుతుంది. ఇది మానసికంగా రావలసిన పరివర్తన; బాహ్యంగా రావలసిన విప్లవం. భూమిపై సమిష్టి యాజమాన్యం, గ్రామ స్వపరిపాలనలద్వారా వస్తుంది. ఈ విధంగా విప్లవ సమగ్ర

స్వరూపం ప్రత్యక్షమవుతుంది. హింసాపద్ధతిని లేక శాసనంద్వారా సాధించిన విప్లవానికి పూర్తిగా భిన్నమైన విప్లవకార్యక్రమం ఇది.

విప్లవ సాధనకు ఇది సరికొత్త పద్ధతి. దీని అనుభవం ప్రపంచానికి ఇంకా కలగలేదు. కొత్త భావాలపట్ల సంశయం, ఔదాసీన్యం ప్రకటించడం సామాన్యంగా జరుగుతూ ఉంటుంది. కాని భారతదేశంలో మనం పూర్తిగా కొత్తపద్ధతులద్వారా భావాల ద్వారా జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించుకున్నాం. ఆదిలో వీటిని కూడా చాలామంది సందేహించారు. హేళన చేశారు. అయినా విజయం సాధించాం. గాంధీజీ అవలంబించిన పద్ధతులనే భావాలనే, వినోబా ఇంకా ముందుకు తీసుకువెళ్ళే టందుకు ప్రయత్నిస్తున్నారు కనుక మనం దీనిని అర్థం చేసుకోగలం. ఇతర జాతుల, దేశాల అనుభవంతో గుణపాఠం నేర్చుకునే స్థితిలో కూడా మన మున్నాము. ఆయా దేశాలు పొందిన విజయాల, వైఫల్యాల వృత్తాంతాలు పరిశీలించి మనం లాభం పొందవచ్చును. స్వాతంత్ర్య సముపార్జన తరువాత ఉత్సాహవంతులైనవారు అధికార స్థానాలు పొంది దేశసేవ చేద్దామని ఉవ్విళ్ళూరడం సహజం. కాని అధికారం ద్వారా సేవచేయగలమన్న భావం ఎంత పొరబాటైనదో గుర్తించి, దేశభక్తులందరూ సర్వోదయ పతాక ఛాయక్రింద సమాయత్తం కావలసిన తరుణ మాసన్నమైనదని గమనించడానికి, గత 10 సంవత్సరాలలో అందరం సమిష్టిగా పొందిన అనుభవం చాలనుకుంటాను. చాలామంది సత్యాగ్రహలోక సేవకులు అప్పుడే సర్వోదయపిలుపు నందుకున్నారు. ఇంకా యిలాంటి వేలాది కార్యకర్తలు అవసరం.

నేను రాజకీయాలనుంచి తప్పుకోవాలని ఎందుకు నిశ్చయించుకున్నానో స్పష్టమైం దనుకుంటాను. ఇది వాస్తవాలనుంచి తప్పించుకునే యత్నం కాదనికూడా అంగీకరిస్తారని ఆశిస్తున్నాను. రాజకీయాలల్లోని కుళ్ళువల్ల జుగుప్సతోకాదు నేను వైదొలగుతున్నది. సర్వోదయ రాజకీయాల ఆకర్షణవల్లనే ఈ నిశ్చయానికి వచ్చాను. నేను పైన చెప్ప యత్నించినట్లు, సర్వోదయంలో కూడా రాజకీయాలు ఉన్నాయి. అయితే ఈ రాజకీయాల స్వభావమే భిన్నమైనది. ఇవి పార్టీకి, అధికారానికి సంబంధించిన రాజకీయాలు కావు. ఇవి ప్రజల రాజకీయాలు. లోకనీతి, రాజనీతి కంటే భిన్నమైనది. సర్వోదయ రాజకీయాలకు అధికారంతో కాని, పార్టీతోకాని సంపర్కంలేదు. అధికార కేంద్రాలన్నింటిని తుదముట్టించాలనే వాటి ఉద్దేశం. ఈ నూత్న రాజకీయాలు ఎంతగా విజృంభిస్తే, పాత రాజకీయాలు అంతగా క్షీణిస్తాయి. శాసనముక్తి కూడా లభిస్తుంది.

రాజనీతికీ, లోకనీతికీ మధ్య వైరుధ్యానికి కాని, ఘర్షణకు కాని అవకాశమే లేదు. ఈ రెంటినీ అంటరానివిగా దూరంచేసి ఉంచడానికీ వీలులేదు. రాజనీతి నుంచి ఉద్భవించిందే లోకనీతి. వీటిమధ్య నిత్యానుబంధం, సహకారం నెలకొనాలి. ప్రజలు స్వపరిపాలనానుభవాన్ని సాధ్యమైనంతవరకు పొందాలన్న భావానికి, ప్రజాస్వామికమైన రాజనీతిలో వ్యతిరిక్తత ఏమీ ఉండడానికి వీల్లేదు. పుత్రులు యుక్త వయస్కులైనప్పుడు వారికి పెత్తనాన్ని కట్టిపెట్టాలనే బుద్ధిమంతుడైన తండ్రి భావిస్తాడు. అలాగే, ప్రజాస్వామిక పార్టీలు ప్రజలకు అధికారం అప్పగించడానికి సంసిద్ధులై

ఉండాలి. అలా అప్పగించాలనే అవి కాంక్షించాలి. లేకపోతే అవి ప్రజాస్వామిక పార్టీలు కాజాలవు. నా కార్యభారం అవకాశం కల్పించినప్పుడు, మన రాజకీయ వ్యవస్థలో రాజనీతి, లోకనీతిగా పరిణమించగల విధానంగూర్చి నాకు తోచిన అభిప్రాయాలను దేశానికీ, ప్రజలకు వివరిస్తాను.

మరొక విషయాన్ని కూడా నేను చెప్పాలి. నా శక్తిసంపద లన్నింటినీ, లోకనీతి నిర్మాణం కోసమే కేంద్రీకరించినా, రాజనీతి రంగంలో జరుగుతూ ఉండే పరిణామాలను ఎప్పటికప్పుడు కని పెడ్తూనే ఉంటాను. మంచికో చెడుకో కాని, రాజనీతి ప్రభావం కొంత ప్రజలమీద ఉంటుంది. ఈ ప్రభావం సాధ్యమైనంతవరకు ఉపయుక్తంగానే ఉండేటట్లు రాజనీతికి వెలుపల ఉంటూ యత్ని స్తాను. ఇది ప్రమాదకరమైనదని నాకు తెలుసు. నా రాజకీయ చదరంగంలో ఇదికూడా ఒక ఎత్తుఏమోనని ఇతర్లు అపార్థం చేసుకోవచ్చును. అలా జరిగితే నాకు చాలా దుఃఖంకలుగుతుంది. ప్రజాజీవనంలో బహుశా ఇలాంటి అపార్థాలనుంచి తప్పుకో లేమేమో. అయినా నాకు సంబంధించినంతవరకు, ప్రతిసమస్యను పార్టీ రాజకీయాలకు అతీతమైన నిర్లిప్త దృష్టితో పరిశీలించడం తప్ప మార్గాంతరం లేదని హామీ ఇస్తున్నాను. నేను జోక్యం కలిగించుకోవడంవల్ల ఎవరికైనా ఇబ్బంది కలిగితే అది నా దుః దృష్టమే ఔతుంది.



మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముని బ్రహ్మ మర్యాదను స్థాపించుట. శ్రీకృష్ణుని బ్రహ్మ అనాసక్త కర్మయోగం. బుద్ధుని బ్రహ్మ యజ్ఞకార్యములనుండి హింసను తొలగించుట. ఒకొక్క కాలానికి ఒకొక్క కొత్త బ్రహ్మ. బ్రహ్మ అంటే విశాలమైన ఊహ. ఇపుడు మన ముందున్న బ్రహ్మ ఏమిటి? మన జీవితోద్దేశ్యం ఏమిటి? స్వరాజ్యం తర్వాత మనకు సర్వోదయమనే బ్రహ్మ లభించుట సంతోష ప్రదమైన విషయం. కొత్త బ్రహ్మ, కొత్త యజ్ఞం, కొత్త త్యాగం, కొత్త ఉత్సాహం— ఇవన్నీ ఉన్నప్పుడే జీవితం జీవించుటకు తగినట్లుగా ఉండగలదు. ఈ విధంగా ఎప్పటికప్పుడు కొత్త బ్రహ్మలను జీవితంలో తెచ్చుకుంటూ పరబ్రహ్మవరకూ చేరుకోగలము. ఈ విధంగా ప్రపంచమంతటా సామ్యయోగం స్థాపించబడగలదు.

— వినోబా.